శ్రీశివాయగురవేనమః.

# శ్రీ రాజేశ్వరశతకము.

# శ్రీ చంద్రమౌళీశ్వరశతకము.

ఇయ్యవి

బ్రహ్మశ్రీ ములుగు వీరభద్రయ్యశాస్త్రిగారిచే

రచియింపఁబడి

బ్రహ్మశ్రీ

తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రిగారిచే

పరిష్కరింపఁబడి



నిడుబ్రోలు

తాతా ముద్రాక్షరశాల యందు

ముద్రింపఁబడినవి.

స్వస్వామ్యసంకలితము]  1934  [వెల రు ౦-౮-౦



శ్రీరస్తు

శ్రీరాజేశ్వరాయనమః

# శ్రీ రాజేశ్వర శతకము.

శ్రీకల్యాణ గుణాకరుండు కరుణా ♦ సింధుండు వాణీశ్వరా
స్తోత్రశ్లోకితసత్కథాఢ్యుఁడు మునిస్తు ♦ త్యప్రభావుండు గౌ
రీకాంతా వదనాబ్జ షట్చరణ ము ♦ ర్వీనాథ నేత్రార్చితుం
డా కీనాశ వినాశకుం డిడుత మా ♦ కన్ శాంతి నశ్రాంతముల్.

కం॥ వేమారాధ్య కులీనుఁడు
స్వామీ! శ్రీవీరభద్ర ♦ శాస్త్రి ముదమునం
గామిత దాయకు ని న్గొని
సేమంబుల నందఁ గోరి ♦ చేయు శతకముల్.

శా॥ శ్రీకంఠున్ ఫణిభూషణుం బురహరున్ ♦ శీతాంశుకోటీరునిన్
నాకాధీశ్వర వందితాబ్జ చరణు ♦ న్బృందారు బృందారకా
నీకున్ శాశ్వతు శాంకరీప్రియు శివు ♦ న్నిత్యప్రభావోన్నతున్
శ్రీకల్యాణ గుణాకరు న్నిను మదిం ♦ జింతింతు రాజేశ్వరా? 1

శా॥ శ్రీమద్రాజశిఖామణీ! మనవి, వా ♦ సిం గన్న మీసత్కథల్
శ్రీమంతు ల్మహితాద్య కావ్యులు రుచు ♦ ల్పిప్పిల్లఁగాఁ జెప్పిరే
మే మో కల్పనల న్మహాప్రతిభ నెం ♦ తేఁ బ్రీతిఁ బద్యాళి నే
నామాద్రిన్ రచియింప శక్తుఁడనె? మా ♦ న్యధ్యేయ! రాజేశ్వరా! 2

శా॥ విద్యానాథ సమర్చితాంఘ్రివగు ని ♦ న్విఖ్యాతిఁ బూజింపఁగా
హృద్యంబై యలరారు సత్కవిత నెం ♦ తే వేడ్కమైఁగాంచెదం
బద్యం బొక్కఁడు నీకొసంగు కవి యె ♦ వ్వఁడైన శుభం బందఁడే
సద్యోజాతముఖాబ్జ భక్తజనర ♦ క్షాదక్ష రాజేశ్వరా ! 3

శా॥ విద్యాపారగతం బ్రకాశిలి లస ♦ ద్విఖ్యాతి నార్జించి శ్రీ
విద్యాయోగముఁ గాంచి మించి సకలో ♦ ద్వేలప్రభావాప్తిమైఁ
బద్యంబుల్ రసగద్యము ల్గలిపి శం ♦ భత్కావ్య సంరంభము
ల్సద్యోలక్ష్యతఁ గూర్చు శక్తి నిడి ని ♦ చ్చల్గావు రాజేశ్వరా ! 4

శా॥ ముద్యోగం బెఱి నీ సమర్చనము సొ ♦ మ్మున్నమ్మి నేఁ జేయు స
ర్వాద్యంబైన భవచ్చరిత్రమున నా ♦ కత్యంత మాసక్తి మే
ల్విద్య ల్మేకొనఁబోవు భక్తి యొకఁడే ♦ విఖ్యాతిగా నుండె స
ద్విద్యాగోచర! నాదుపాపముల ను ♦ ర్విం గూల్చు రాజేశ్వరా! 5

మ॥ అమితోత్సాహమునన్ భవన్మహిమ న ♦ త్యర్థంబు వర్ణించు జి
హ్వా మహిన్ స్వచ్ఛకవిత్వసంపదల వ ♦ హ్వా! నాగ దీపించు నం
చు మహాత్ము ల్వచియింప వింటిని లస ♦ త్సూక్తిం దపర్థంబు న్యా
య్యు మటంచున్ మది నమ్మి దానికయి నే♦యత్నింతు రాజేశ్వరా! 6

మ॥ కవితాదక్షత నూత్నయత్నమున నీ ♦ కావ్యంబు సాగింతు నం
చు వచింపన్ భవదంగణంబున నదే ♦ చోద్యంబా? నీభక్తి దు
ర్భవపంకంబు నడంచి మించి నిను దీ ♦ వ్యత్ప్రీతి నాలించు రీ
తి వెలుంగం బచరించు నంచెఱిఁగితిం ♦ దేవేశ! రాజేశ్వరా! 7

మ॥ పరమేశా! త్రిపురాంతకా! గిరిసుతా ♦ ప్రాణేశ్వరా! శంకరా!
గిరిధన్వీ! వృషవాహనా! స్మరహరా! ♦ కీనాశవిధ్వంసకా!
హర! కైలాసగిరీంద్రమందిర! నమ ♦ ద్ధర్యక్ష! విశ్వేశ్వరా!
పరమామోద మొసంగు భక్తునకు భ ♦ వ్యప్రీతి రాజేశ్వరా! 8

మ॥ శివ పంచాక్షర మంత్రరాజమును సు♦శ్రీఁగోరి చింతించు మా
నవవర్గంబు భవత్కటాక్షముల దై ♦ న్యం బేది సాయుజ్య సం
భవ మోదంబును గాంచు నంచు బుధు లె♦ప్పట్లన్ ప్రబోధింపఁగా
భవపాశప్రవిదారకు న్నిను మది ♦ న్భావింతు రాజేశ్వరా! 15

మ॥ నికట శ్రీభవదీయ మంత్రము మహా ♦ నిష్ఠాప్తి ధ్యానించు వా
రికి వారంబులు యోగముల్ కరణముల్ ♦ రిక్క ల్తిథు ల్గొప్పదు
శ్శకునంబుల్ గ్రహము ల్విరుద్ధముగ నే ♦ చంజాలునే? దాహకా
స్త్రికముం జేరఁగ నోపునే చెదలు? వ♦ర్ణి ధ్యేయ! రాజేశ్వరా! 16

శా॥ భూత్యుద్ధూళన శుభ్ర దేహులు జటా ♦ భూ మోత్తమాంగుల్ తపో
నిత్యప్రాభవు లీశలింగధరు లు ♦ న్నిద్రుల్ మహామాలికా
న్నత్యప్రాంచిత పంచవర్ణులు నితాం ♦ తధ్యాననిష్ఠాప్త సాం
తత్యశ్రీకులు త్వత్స్వరూపులని ని ♦ ధ్యానింతు రాజేశ్వరా! 17

శా॥ రాజద్భక్తి విభూతిఁ బూసి శతరు ♦ ద్రాక్షల్ మెడంగట్టి ని
న్నోజన్ శంకర! పార్వతీరమణ! మ ♦ మ్మోమంగ జే యంచు ని
ర్వ్యాజాలంకృతిఁ బేటికాంతరమునం ♦ దాస్థ న్నినున్ దాల్చి మూ
కీజన్మంబులఁ దోఁచుమూర్తు లవి నీ ♦ వే కావె! రాజేశ్వరా! 18

మ॥ సలిలోన్మజ్జన మాచరించి శుచివ ♦ స్త్రంబు ల్గగం దాల్చి దు
ర్మలవిధ్వంసకభూతిరేఖలు శరీ ♦ రం బందుఁ గీల్కొల్పి పే
శలరుద్రాక్షసహస్రము ల్విధిగఁ ద ♦ త్స్థానంబులం జేర్చి ష
ట్స్థలి, షట్కాలము శైవలింగమగు ని♦న్ధ్యానించు రాజేశ్వరా! 19

మ॥ శివయోగిం గని భక్తి జోత లొసగన్ ♦ శ్రీగల్గుఁ దచ్ఛ్రీపదం
బు విలోకించి సుమార్చనంబు లిడ న ♦ బ్బున్సర్వసౌఖ్యంబు దు
ర్భవపంకం బడఁగుం దదీయకరుణా ♦ భాగ్యంబునం జేసి యం
చు వివేకు ల్వచియింతు రానుడుల మె♦చ్చుల్ వింటి రాజేశ్వరా! 20

మ॥ ఇల సద్ఘోటకభద్రహస్తినివహం ♦ బేలెక్క ? యాందోళికా
వళు లేలెక్క ? కలావతీవిహితస ♦ వ్యద్భోగ మేలెక్క ? మం
జులవాగీద్యకవిత్వతత్త్వకలనా ♦ జుష్టం బదేలెక్క ? ని
ర్మలసచ్ఛాంభవలింగపూజకునకున్ ♦ రామేశ ! రాజేశ్వరా ! 21

మ॥ అమితప్రాభవశక్తి నీవనుచు నే ♦ సత్యాంతసద్భక్తి శా
స్త్రములన్ వింటి నెఱింగితి న్బుధులవా ♦ త్సల్యంబునం జేసి నే
మము మీఱన్ భవదీయపూజనము ని ♦ మ్మాద్రిం బొనర్తు న్నను
న్విమలాంతఃకరణాఢ్యుఁ జేసి మనుప ♦ న్విచ్చేయు రాజేశ్వరా! 22

శా॥ నిన్నే నేఁ గులదైవ మంచు గిరిజా ♦ నేతా ! మది న్వేఁడనో ?
పున్నెంబుం దొలిమేన నీనెనరు నిం ♦ పుంగూర్పఁగాఁ జేయనో ?
యెన్నం దానవకభక్తసంఘముల నె ♦ న్నే రీతులన్ గొల్వనో
నన్నుం గావు మెఱుంగ నా దెయిద మే ♦ నాఁడేని రాజేశ్వరా! 23

శా॥ బత్తిం బెట్టులభించునో నుతి కుటుం ♦ బం బెట్టు పోషింతునో
బత్తిం దానవకభక్తగోష్ఠుల లస ♦ ద్భాగ్యం బెటు ల్గాంతునో ?
సత్తామాత్రము లేదియో యెఱుఁగ నీ ♦ సంసేవయే తక్క నా
చిత్తస్థైర్య మొసంగి మేలిడు సత ♦ శ్రీనాథ ! రాజేశ్వరా ! 24

శా॥ రొక్కం బొక్కఁడు గవ్వయేనిఁ గొన కా ♦ రూఢిన్ యజింపఁగనౌ
చక్కం బాల్గొని మూఢభక్తుఁ డొకటన్ ♦ సంకల్పముం జేయునీ
ఫక్కిం గానని వాఁడు గానఁ గరుణా ♦ పాథోనిధీ ! భక్తియే
నిక్కం బేని దరించు నాతఁ డిల న ♦ ర్ఘింప గ రాజేశ్వరా ! 25

శా॥ ఎంచం ద్వ న్మహిమాతిరేకముల నె ♦ న్నే యాత్మము ల్సల్పిన
న్నించిత్తైనను శక్తులే సుమనసుల్ ♦ నేనెంత ? నీ భక్తి సా
ధించంగా నె యు దెంత కార్యమయినన్ ♦ దీనత్వ మింకేల ? నీ
సంచారంబున కష్టనుం గలదె యా ♦ నత్తైని ? రాజేశ్వరా ! 26

శా॥ మోక్షుంభావులు నీదుభక్తులిల సొం ♦ పుం గాంచి యెద్దాని నా
సక్తిం జెంద భవత్సమర్చనము ని ♦ చ్చం జేర్తురో దాని సం
రక్తిం గూర్చి కృతార్థులం బొనరుతో ♦ రామాద్యనేకేశ వి
ధ్యుక్తారాధన తోషితాత్మ! ధృతసిం ♦ ధూ! దేవ! రాజేశ్వరా!27

శా॥ సమ్మోదంబున భక్త సంతతులకున్ ♦ సౌఖ్యంబు లందిచ్చు పా
దమ్మేమీకు శరణ్య మంచు నెపుడున్ ♦ ధ్యానంబు గావించి మో
దమ్ముం జెంది మదీయ హృద్వనజ సౌ ♦ ధం బిచ్చితిం గాన ధ
ర్మమ్ము న్నీకెఱిఁగింపఁగా వలెనె? ధీ ♦ రా! రాజరాజేశ్వరా! 28

శా॥ నీ పాదాంబుజముల్ హృదంబుజమున ♦ న్నిత్యంబుఁ బూజింతు సం
తాపం బంతయు నొందఁ జాల నిఁక మో ♦ దం బందు లోటేమి లే
దే పాపంబును లేదు; ధర్మమున లే ♦ దేమాత్రమే లోపముం;
బాపారణ్య దవానలా! ననుఁ గృపం ♦ బాలింపు; రాజేశ్వరా! 29

శా॥ పెక్కుల్చిక్కులు పిక్కటిల్లఁ జదలం ♦ బెంపొందునేక; స్పదే
ఫక్కి న్నిక్కెడుసంపద ల్గలుగ దా ♦ ర్భాగ్యంబు నీభక్తు లే
చక్కిం గల్గుదు రయ్యెడం గలుగునే ♦ సౌభాగ్యలోపంబు? నీ
దృక్కోలంబుననేని నెంచ నిభృతా ♦ ర్థి! దేవ! రాజేశ్వరా! 30

శా॥ విశ్వాతీతుఁడ నేన యంచు మది ను ♦ వ్విస్ఫూర్తి గర్వాన ని
న్విశ్వాధీశునిఁ గొల్వ మాని కడుదు ♦ ర్విజ్ఞానపాథోధిఁ దా
నైశ్వర్యంబును బాసి మగ్నుఁడగు న ♦ య్యైకార్యజాతంబు లం
దాశ్వాసింపఁడు నిజ్జడుం డకట! యా ♦ ర్యాధీశ! రాజేశ్వరా! 31

మ॥ పెరదేవళ్ళ యజింప; నీదుభజనా ♦ భీష్టంబుఁ దగ్గింప; సుం
దరవారాంగనలం గణింపఁ; బరకాం ♦ తం దద్దసిందింప; నా
సురకృత్యం బెది యేనిఁ బెంప; మఱి నా ♦ శుద్ధాంతరంగంబు త్వ
చ్చరణాబ్జమ్మున కాలవాల మగు న ♦ శ్రాంతమ్ము; రాజేశ్వరా! 32

మ॥ వసుధ న్నీశిరమందు బిల్వ మొకఁ డుం ♦ పంజాల కొకొక్కండ్లు సం
తసముం బొంచి సతంబు పండ్లను ప్రసా ♦ దంబు ల్వడ ల్దోసెలున్
బెసరట్టు ల్గుడుముల్ రసంబులు ను నై ♦ వేద్యంబు లర్పించి యా
దెస దేవళ్ళ నుగొల్చి చేడ్పడుదు రెం ♦ తేఁ దండ్రి! రాజేశ్వరా! 33

శా॥ సర్వోపాస్యుఁడ వీవ యంచు శ్రుతులు ♦ న్శాస్త్రంబులుం బల్కఁగా
గర్వోద్రేకమున న్వినీవినక నీ ♦ కైంకర్యముం గోర కీ
ఖర్వాం డందుఁగొనంగఁ జాలెడినె? వే ♦ గన్ సత్ఫలం బెట్టులే
నుర్వి న్దుఃఖులతాలవిత్ర! విధృతేం ♦ దూ! దేవ రాజేశ్వరా! 34

శా॥ రోత ల్గల్గెడి గేహకృత్యతతి నా ♦ రూఢి న్విచారింపఁగాఁ
బూతం బయ్యెదియే యటంచు మది నె ♦ ప్డుం బాయఁ డత్యూర్జిత
స్ఫీతిం ద్వద్భజనప్రసక్తిరచనా ♦ ప్రీతుండు గాఁ డెట్టులుం
జేతోహీనుఁ డభక్తుఁ డెంతయు నగు ♦ న్సిద్ధంబు, రాజేశ్వరా! 35

మ॥ కుతుకంబారఁ బరాంగనామణుల బా ♦ గుంజూచి మోహించు; దు
ర్మతిమై దేశిక వంచనంబునకు గు ♦ మ్మంబెక్కు; వారాంగనా
రతి సర్వంబుఁ ద్యజించు, నర్చనము ఘో ♦ రంబంచుఁ బాయున్ వితా
వితఁ దాఁ జెందు సతం బభక్తుఁడు నతో ♦ ర్వీదార రాజేశ్వరా! 36

శా॥ దీనుండం గద నేను నాదిగులు పృ ♦ థ్వీం దీర్పఁగా లే రొరుల్
దీనన్ శ్రీనిధి వం చెఱింగి నిను నా ♦ దీనత్వము న్మాన్పఁగాఁ
బూన న్వేఁడి నుతింతుఁ బద్యముల చేఁ ♦ బూజింతు నీకింక జా
నౌనా జాగొనరించ నన్నెరి వృషా ♦ ధ్యక్షాంక రాజేశ్వరా! 37

మ॥ ఒకనాఁ డేని భవత్పదాబ్జయుగమం ♦ దొక్కండు బిల్వంబు ను
త్సుకతం బెట్టి భజించు మానవుఁడు చెం ♦ దున్సుస్థిరైశ్వర్యభా
వుక సంతానపరంపర ల్వసుధ నే ♦ వో క్రూరకృత్యంబు లెం
చక సేయు న్ఖలుఁ డేమి చోద్యమొకొ? ప్రా ♦ జ్ఞధ్యేయ! రాజేశ్వరా! 38

మ॥ ఒకపూట న్సకలాధినాథునిను స ♦ ర్వోపాస్యు భావించి మా
మకహృద్వీధి భజించి సంతతము శం ♦ భత్ప్రీతి నర్థించి నీ
నికటక్షోణి ననేకవందనముల ♦ న్నేర్పొప్ప గావింప నే
రక వాపోయెద నెట్లుప్రోచెదవొ రా ♦ రా పోఁగి రాజేశ్వరా! 39

శా॥ పాడం గోరెద నీదుకీర్తనము తె ♦ ప్పట్ల న్మహాభక్తితో
వేడం జూచెద నీదు కింకరుల ను ♦ ద్వేలానురాగంబుతో
వీడ న్నీదుపదాంబుజద్వయము న ♦ న్వీడంగనౌ నెట్లు ? నీ
వాఁడన్ జాలమిఁ కేల లీలమెయిఁ గా ♦ పాడంగ రాజేశ్వరా! 40

శా॥ తప్పం జూడవు సత్యమెన్నఁటికిఁ ద్వ ♦ ద్దాసాను కంపాస్తిమై
గుప్ప ల్గూర్తువు సౌఖ్యపుంజముల లో ♦ కు ల్భ్రాంతి నొందంగ నీ
గొప్ప ల్మాదృశు లెన్నఁగాఁ గలరె వా ♦ గ్గుంభప్రసక్తి న్నెటే
సప్పా! భక్తుఁడఁ గావఁగావలయుఁ బ్ర ♦ త్యాసక్తి గాజేశ్వరా!41

శా॥ వంచింపం దగునా? మహేశ్వర! కృపా ♦ వారాశివై న న్గటాఁ
క్షాంచల్లీలలఁ బ్రోవఁగాఁ దగు ; నటు ♦ ల్గాపింప కీవున్న నే
గాంచం గల్గుదునెట్లుసంపదల నె ♦ క్కాలంబు రంజిల్ల హృ
చ్చాంచల్యంబు దలంగఁ గూర్చువల ని♦చ్చం జేర్పు రాజేశ్వరా!42

మ॥ భవదీయాకృతిఁ గాంచు, నీస్తుతి లస ♦ ద్భక్తిం బ్రశంసించు దు
ర్వ్యవసాయంబును జెందఁ డెప్పుడు మహా ♦ వాక్యార్థమర్థించు బాం
ధవభూతుం డగు భూతసంతతికి సం ♦ ధానించి నిర్గోల్చు సం
భవ దుఃఖంబును బాయు భక్తుఁడు శివా ♦ ప్రాణేశ! రాజేశ్వగా! 43

శా॥ చేయం జాలితిఁ గొన్ని పాపములు నేఁ ♦ జేచేత నింకెన్ని యీ
మాయామేయ జగంబునం దొనరుప ♦ న్మత్తిల్లి యున్నాఁడ నో
హేయం బన్న దెఱుంగ నీకరుణ యె ♦ న్నేరీతులం బ్రోచునన్
హాయిం జెంది మెలంగుచుంటిని నమ ♦ స్యల్నికు రాజేశ్వరా! 44

మ॥ అవనీవ్యోమసమీరనీరదహనాజమా ♦ నార్కేందువహ్న్యాద్యమూ
ర్తివి నీరూపము లెల్లెడ న్వెలయుచున్ ♦ ద్వ్యాధి న్నిరీక్షించుచుం
డి వివేకు ల్గనుచుంద్రు నీపరమ కో ♦ టిం బక్షపాతుల్గదా
శివ యోగుల్నను వారిఁదార్చ నగుమో ♦ శ్రీకంఠ! రాజేశ్వరా! 45

శా॥ ఎన్నో నోములు నోచితిం దొలుత నె ♦ ట్లే నిన్ను బ్రార్థింపనా
పున్నెం బన్నిఁట వర్ణనాసహము తే ♦ పున్నాపు సేవింతు సం
పన్నం బైన మనంబుతోడ నను నీ ♦ భక్తుం గటాక్షింపు మో
యన్నా! తక్కొరుల న్భజింప నిఁక దిక్వ్యాారాధ్య! రాజేశ్వరా!46

మ॥ మృగనాభిన్ దవణించు కంఠకళ బ ♦ ల్మిం దారుమార్సేయు వ
ర్ణ స్రగకాంతిపరిధ వింతసేయఁగ సమ ♦ స్తం బొందురీతి న్వెలుం
గఁగఁ జేయ న్నమకట్టు ధూర్జటివి వే ♦ డ్కల్వేలు మాకన్యెదుర్
జగతీస్యందన! నీకటాక్షములు గ ♦ న్న న్మేలు; రాజేశ్వరా! 47

మ॥ శరణం బీ వని నమ్మువార లిల మో ♦ క్షుం బందఁగా నేల? ని
ర్భరసంసారపయోధి వారలకు గో ♦ ష్పాదంబు గానేల? ని
ర్జరనాథాంచితసిద్ధి వారికిఁ దృణ ♦ ప్రాయంబు గానేల? నీ
కరుణం గాంచిన భక్తసంతతికి లె ♦ క్కాయెన్ని? రాజేశ్వరా! 48

మ॥ గురు సేవించి బిరాన నీమహిమ నెక్కొ ♦ ల్లాచఁజాలన్ భవ
చ్చరణాంభోజసమర్చనం బెడఁద మె ♦ చ్చం జాల; వాగర్థ సుం
దరమూర్తి న్నిను యోగమార్గమునఁ నె ♦ న్నం జాల; శాస్త్రార్థ మే
నెఱుఁగన్ దాసుఁడఁబ్రోవఁగాఁ దగుదు నో ♦ యీశాన! రాజేశ్వరా!49

మ॥ వఱువాత న్నయనంబు నుండి నిను దే ♦ వా! వామదేవా! శివా!
హరిబాణా! నతబాణ! ఫాలనయనా! ♦ హస్తాగ్రనృత్యన్మృగా!
గిరిజాహృద్వనజాత భాస్కర! నమ ♦ త్కల్పద్రుమా! యన న్నేము న
ప్పురుషుండే భవదీయ భక్తుఁ డగుఁ బ్రా ♦ పుం జెంద రాజేశ్వరా!50

శా॥ నిత్యార్చానముపాత్తనిష్ఠ మెయి వ ♦ ర్ణించు న్నినున్ యోగసాం
గత్యంబు న్విడనాడఁ డెల్లెడల న ♦ క్కాలంబు సల్లత్ప్యతన్
స్తుత్యంచద్రచనా విశేష కలనా ♦ శుంభద్వచోవైఖరిన్
ప్రాత్యత్వంబు దలంగి ముక్తుఁడగు న ♦ వ్వాఁ డద్ధె రాజేశ్వరా! 51

శా॥ కేదారేశు భజింతునో? గిరిశుఁ గో ♦ ర్కె లీల్మిఁ సేవింతునో?
వేదారణ్యు యజింతునో? శివుని పృ ♦ థ్వీలింగముం గొల్తునో?
యేదారిం జననేరఁ గింకరుఁడ న ♦ న్నింతేరహిం బ్రోవవే
మోదావాప్తి ఘొసంగ వందనము సం ♦ బోధాత్మ, రాజేశ్వరా! 52

మ॥ హరులు న్సామజముల్ రథంబులు భటా ♦ ధ్యత్తు ల్సుకాంతల్మణు
ల్జడివల్వ ల్మఱి పల్లకు ల్కుసుమముల్ ♦ సౌధావతంసంబులున్
సరసామోదములు న్సమస్తమును మో ♦ క్షం బివ్వఁగాఁ జాలునే?
(ప)రముం గూర్పఁగఁ జాలియున్నయదినీ ♦ పాదంబె రాజేశ్వరా! 53

శా॥ వేదంబు లుదిముట్టఁగాఁ జదివిన ♦ న్వేదాంతము ల్నేర్చిన
న్వేదార్థంబు లెఱింగిన న్సకల స ♦ ద్విద్యాళి నార్జించిన
న్మోదం బుప్పతిలంగ యోగవిధు లె ♦ న్నో నేర్చి మిన్నందిన
న్నీదాక్షిణ్యము లేక ముక్తిఁ జెటుగా ♦ నేరందు, రాజేశ్వరా! 54

మ॥ కుతుకం బొప్ప సమస్తశాస్త్రములఁ జి ♦ క్కు ల్దీర్పఁగాఁ జాలి సం
తతమున్ దేశవిదేశము ల్దిరిగి వి ♦ ద్యాపక్షపాతంబు దు
ర్మతి యోజింప మెలంగుభూజనులు స ♦ న్మానార్హు లెట్లౌదురే
గతి నిన్ గాంచి తరింత్రు పాపములఁ ద్రుం ♦ గం జేసి, రాజేశ్వరా! 55

మ॥ ధన మార్జింపగఁ గర్హ్యవృత్తముల ని ♦ ద్రాళివిఁ గైకొంచు నెం
దును జూడం దమచెద్దయము ల్పాపజను విం ♦ దుం గూర్పనుంకించి మే
న నవోన్మేషము లంకురింప నెవో కాం ♦ త ప్రక్రియా ల్స్తోత్రము
ల్ధనికుం గూర్చి రచింత్రసత్కవులు ని ♦ త్యస్ఫీత, రాజేశ్వరా! 56

మ॥ భరమౌ త్వద్భజనప్రసక్తి యని యె ♦ ప్పట్లం బ్రసంగింత్రు దు
ర్భరమై వేచు కుటుంబపోషణము కుం ♦ భల్లీల సంధింత్రు దా
రరయన్ దుర్భగు లెల్లకాల మిటు వో ♦ నామీఁద నేమయ్యెడిన్
గరుణ న్నీవరగాంచ సంపదలు వే ♦ డ్కం గూర్చు, రాజేశ్వరా! 57

మ॥ కులదైవం బగు నిన్ను వీడి పెఱలం ♦ గోరంగ నేఁ బోతినో?
లలితస్వాంతుల నీదు భక్తులను లీ ♦ ల న్నిన్నుగాఁ గొల్వనో?
మలవిధ్వంసకు నిన్ను మానసమున ♦ న్మన్నించి పూజింపనో?
కలదే దోసము న న్ననుంగొనుము సా ♦ క న్వేగ రాజేశ్వరా! 58

మ॥ కమలానందనుఁ డందఁ జాలని భవ ♦ త్కాంతోత్తమాంగంబున
న్నమము ల్వ్రాన్చు టదెట్లు? మాధవుఁడునుం ♦ జూడంగ లేనట్టి నీ
కమలాంఘ్ర్యర్చనముం బొనర్చు టెటు? వీఁ ♦ క న్గ్రిందుమీఁదైనచో
సమకూరం గలవే? భజింతు నిను న ♦ శ్రాంతంబు రాజేశ్వరా! 59

శా॥ పారమ్యం బఖిలాగమాంచిత మనన్ ♦ బ్రహ్మంబు సౌలభ్యపుం
దీ రొప్పించుఁ బిశాచపఙ్క్తి కడు వ ♦ ర్ణించు న్మహోదాత్త్య సం
భారం బయ్యుపమన్యుఁ డంధకుఁడు న ♦ ప్పాటన్ భవచ్ఛాంతి ద్దై
వాఱం బల్కెడు నీకత ద్దెలుప నె ♦ వ్వం డోపు రాజేశ్వరా! 60

మ॥ అనిలో దుష్టు మదాంధు నంధకుని దు ♦ ర్వ్యాపారముల్ గూపుమా
పిన చోప్పే నిజమేని, నాదుహృదయా ♦ విర్భూతి మిన్నందు వా
రిని గామాదుల త్రుళ్ళణంచి, వను దా ♦ రిం జొన్పి రక్షింపు వం
దనము ల్వేలు బొనర్తు భక్తుఁడను గా ♦ నా! నీకు, రాజేశ్వరా! 61

శా॥ గంగాదేవి విశుద్ధికర్త్రి యని వీఁ ♦ కన్ దాల్ప వీ వౌదలన్
శృంగారార్తి భరింపబోవు మధుర ♦ శ్రీ కాలకూటం బటుం
చుం గేళిన్ రుచిజూడ వయ్యదియు న ♦ చ్చో నన్యసాధ్యంబు గా
మిం గాదే పచరించి త ల్లైదిరిపే ♦ ర్మిం జేసి, రాజేశ్వరా! 62

మ॥ హరిపాదోద్భవ నాపగన్ శిరమునం ♦ దత్యంతభక్తి న్నిరం
తరముం దాల్తు వటంచు మోఱకులు వి ♦ ద్యాగంధశూన్యు ల్వచిం
తు రసత్యంబు, భగీరథార్థ మపు డిం ♦ దుం జూడఁ దానై వసుం
ధరకుం రాఁగ ధరించి వీడితి తదా ♦ స్థం బేర్చి రాజేశ్వరా! 63

మ॥ సిరి రాజీవసహస్రపూజనము సు ♦ శ్రీమించఁ గాంక్షించి చే
ర్చి రహిం ద్వన్మహిమ ప్రసక్తి నొకరా ♦ జీవంబు లోపైన భ
క్తిరమన్ స్వీయ మురోజకుట్మలము న ♦ ర్థిం బూంచి నీసత్కృపన్
వరలక్ష్మీస్మప్రథితిం గనం గలిగెశై ♦ వశ్రీద! రాజేశ్వరా! 64

మ॥ నిను బూజించి విరించి సర్జనకళా ♦ నిష్ణాతుఁడై మించె న
వ్వనజాతాక్షుఁడు నిన్భజించి యసుర ♦ ధ్వంసంబుఁ గావించె ని
న్ఘనభక్త్యర్చితుఁ జేసి యింద్రుఁడును స్వ ♦ ర్గశ్రీఁ గొనెం గాన నెం
దును నీభక్తులు సర్వశక్తు లభినం♦ద్యు ల్గారె? రాజేశ్వరా! 65

మ॥ కృతమం దొక్క చెలంది శ్రీసమభిధ ♦ శ్రీఁ గూర్చునీ సేవస
న్మతిఁ దంతూచ్ఛటగేహకల్పనము ల ♦ మ్మాద్రిం బొసంగించి సం
తతమున్ దీపము స్వీయకృత్యముల న♦ త్యంతంబు మాపన్ స్వసం
యుతముం జేసియు కాంచఁగా గలిగె సా♦యుజ్యంబు రాజేశ్వరా!66

మ॥ ఒకఁ డర్చించెను గాఁ; లురోజమును వే♦ఱొక్కండు పూజించె నిం
కొకఁ డర్పించెను మేఁకపెంటికను, వే ♦ ఱొక్కండు గుంచంబు ను
త్సుకతం బూంచె, నొకర్తు కల్లుకడవం ♦ దున్ సేవ గావించెఁ దా
వకరూపం బెదియో యెఱుంగ వృషభా♦శ్వా! దేవ! రాజేశ్వరా!67

శా॥ ఒక్కం డర్చన సేసె ఱాల మఱియుం ♦ కొక్కండు శ్రీపత్రముల్
పెక్కుల్ బూంచె, నొకండు బూజిడుచు బ♦ల్విష్ఠార్హ ణల్గూర్చె వే
ఱొక్కం డెంగిలికట్టికుట్లనిడి యెం ♦ తో భక్తిమైఁ గొల్చె న
మ్మక్కా! నల్వుర నిల్పితయ్యెడ సువ♦ర్ణాస్మ రాజ రాజేశ్వరా! 68

శా॥ రొక్కం బొక్కఁడు రూకలేక యొకఁడా ♦ రూఢి న్సమర్చారతిం
జిక్కన్నాని సముద్ధరించుటకు సు ♦ శ్రీఁ గూర్చి వారాంగనన్
జక్కన్ దార్చితి నీయనుగ్రహము నెం ♦ చన్ మాదృశు ల్శక్తులే
దిక్కాంతార్చితపాదపద్మ ప్రుషితార్థీ ♦ దేవ! రాజేశ్వరా! 69

—♦ నక్షత్రములు ♦—

మ॥ అనయంబోర్వఁ గలట్టిఁ జైసుజనహృ ♦ ద్యంబైన సద్భక్తి హృ
ద్వనజాతంబున నీపదాంబుజము ని ♦ ల్పంజేసి పూజించు న
య్యనఘుం డీజననంబునందు సుమహీ ♦ యంబైననీమూర్తి నెం
దు నటంచు న్వచియింత్రు వేదవిదు లెం ♦ తో నిష్ఠ రాజేశ్వరా! 70

మ॥ భరితాంతఃకరణుండనై శివ! భవ ♦ త్పాదాంబుజాతద్వయి
న్సరసామోదసుపుష్పసంతతుల న ♦ శ్రాంతంబు బూజించు సం
బరము ల్గొన్నఘనుండు నీకరుణ నె ♦ ప్పట్ల న్శుభం బంది యిం
పు రహింప న్భవదాకృతి న్గలుగుఁ జి ♦ ద్భూతాత్మ రాజేశ్వరా! 71

మ॥ కృత కృత్యుండగు భూతిపూతుఁడని స ♦ త్కేళీరతి న్వేదము
ల్సతముం బల్కువచించు శాస్త్రములు న ♦ శ్రాంతంబు ద్వచ్ఛిహ్నా ధా
రి తరింపంగలఁ డన్నసందియము దా ♦ రిద్ర్యప్రభావంబ కా
కితరమ్మో ? తరమే భవన్మహిమ యూ ♦ హింపంగ రాజేశ్వరా! 72

శా॥ రోత ల్పాపెడు గేహకృత్యములకై ♦ రొక్కంబు వెచ్చించుచుం
జేతఃప్రీతి నొసంగు నీభజనముం ♦ జేయంగఁ గానేనియుం
దాతృత్వంబునఁ గూర్పఁ జాలని జను ♦ ల్గారెట్లు త్వద్భక్తతా
స్ఫితి న్గ్రాలఁగఁ జాలి శ్రీలోలయ వా ♦ సింగాంత్రు రాజేశ్వరా! 73

మ॥ మృగము ల్మిన్న భజించి మోక్షముఁ గనెం ♦ బిన్నంది మోదాప్తినై
నగము ల్మిన్న యజించి ముక్తిఁ గొనె నె ♦ న్న న్నీమహాకృత్యము
ల్నగపాత్రైన వచింప నేరవు మహా ♦ శాస్త్రంబులు న్వేదము
ల్నగజాహృద్వనజాతభాస్కర! దయ ♦ న్నన్గావు; రాజేశ్వరా! 74

శా॥ శ్రీదక్షుండు కృతాపరాధునిగ ని ♦ న్నత్యంత గర్వాంధతన్
దా దౌర్భాగ్యముఁ దోఁప నిందితునిఁగా♦దాకొల్పె దుర్వాక్యముల్
వేదధ్యేయుఁడు వీరభద్రుఁ డపు డు ♦ ర్విన్వాని శీర్షంబు సు
శ్రీ దళ్ళోత్కృత్తఁగఁ గూల్చి మించెఁ నమిత♦శ్రీనాథ రాజేశ్వరా! 75

శా॥ పుణ్యాత్ముండు మృకండుసూనుఁడు లస ♦ త్పుష్పోపహారంబులం
బుణ్యాహంబునఁ దార్చి యాజముని నె♦ప్డు న్నైకవభక్తావళి
న్ధన్యశ్రేణిఁ దొలంగి పొమ్మనుచు మీఁ ♦ ద న్నిక్షితుంజేసె నా
గణ్యం బయ్యది నీదుభక్తులకు నె ♦ క్కాలంబు రాజేశ్వరా! 76

మ॥ పురుషశ్రేష్ఠుఁడు దిన్నఁ డొక్కరుఁడు నిం ♦ బూజించె వేదేతరం
బరయ న్వాని సమర్చనం బయిన దీ ♦ వ్యత్ప్రీతిఁ గైకొలునం
బరమానందముఁ గూర్చితౌ బళిర! త ♦ త్ప్రౌఢిం బరీక్షించుచు
న్ధరఁ గన్నప్పను జేసి సాకితి వనం ♦ తప్రార్థ్య రాజేశ్వరా! 77

శా॥ శ్రీనందంబున నంది నిత్యము త్వదీ ♦ యామేయసన్మూర్తి యెం
తేని న్వృద్ధి నుతించి పుష్పముల భ ♦ క్తిం గొల్చి సంతోషి యై
పూనెం ద్వత్కరుణాలవం బదియె మ ♦ మ్ముం బ్రోవ నొఁగావుతన్
నానాభంగుల సర్వసౌఖ్య మిడి మా♦నాథాగ్ర్య రాజేశ్వరా! 78

శా॥ మత్యాచార్యుఁడ వైన ధూర్జటి లస ♦ న్మాధ్వీకమార్ద్వీకపుం
గత్యోఘంబున నీకృతిం బొనరిచెం ♦ గాదే మహాభక్తిమై
నత్యంతప్రతిభావిరాజితుఁడ న ♦ య్యా! కాను నాసూక్తి నీ
యత్యంతాదర ముంచి చేకొనుము వి ♦ ద్యానాథ రాజేశ్వరా! 79

మ॥ పురుషోత్తంసుఁ డగస్త్యుఁ డొక్కయెడ నిన్ ♦ బూజించి సద్భక్తి దు
ర్భరసాముద్రజలంబు నాచమనమున్ ♦ భవ్యా! యటంచున్ ధృతిన్
సరగం జేసె భవత్సమర్చనము శ ♦ శ్వత్కీర్తి వర్ణింప నె
వ్వారికి న్శక్యమె మూఁడులోకముల దే ♦ వశ్రేష్ఠ రాజేశ్వరా! 80

శా॥ ఉద్యచ్ఛక్తిఁ బరాశరాత్మజుఁడు ము♦ద్యోగంబు రెట్టింపఁగా
నాద్యుం డవ్యయుఁ డప్రమేయుఁడు ఘనుం♦డావిష్ణు డానంచుఁ దాఁ
బద్యం బొక్కఁడు వల్కి మోసపడె నీ ♦ పారమ్యముం గాంచ కే
వేద్యా! భక్తుఁడ నెంతవాఁడఁ గృప న♦న్వీక్షింపు రాజేశ్వరా! 81

మ॥ హరి త్వత్పాదసమర్చనాభిరతి నా♦య్యస్భక్తిమై వేయి బం
గరుదమ్మ వ్రతనిష్ఠఁ దార్చునెడ నొ♦క్కం డూనమైనంత సం
బరముం జెంది నిజాంబకం బిడినచో ♦ వాత్సల్య మొప్పారఁ జే
ర్చి రహిం జక్ర మొసంగినాఁడవుగదే ♦ శ్రీకంఠ! రాజేశ్వరా! 82

శా॥ చిత్తం బెంతయు నీయెడ న్నిలిపి సు♦శ్రీఁగూరఁ బూజించి బ
ల్బత్తిం బూర్వకవీంద్రు లెందఱో లస♦ద్వాగర్థసన్ధానతా
మత్తస్ఫీతి రచించి మించి రఁట యు♦ష్మత్స్తోత్రజాలంబు; నీ
చిత్తం బిత్తఱి నాదు భాగ్యము నత♦శ్రీకాంత రాజేశ్వరా! 83

శా॥ స్వారాజ్యంబున నింద్రముఖ్యులు లస♦ద్భావంబుల న్నిల్చి నీ
పారం బందఁగ నేర రన్న నిఁక నా♦భాగ్యంబు నీచిత్త మా
ఘోరంబు ల్గనఁ జేయకయ్య నను బ♦ల్మూర్ఖిం గన న్నీకయా
సారాచారవివేకశీలనపటి♦ష్ఠా! సాంబ! రాజేశ్వరా! 84

శా॥ విశ్వైకాత్ముని నిన్ గుబేరుఁడు లస♦ద్విఖ్యాతిఁ బూజించి తా
శశ్వద్భాగ్యసమృద్ధిఁ జెంది సరగ♦న్సర్వేడ్యుఁడై నాఁడు భ
వ్యైశ్వర్యాప్తికి నీయనుగ్రహమె భా♦వ్యం బెన్ననౌఁగాదె? యో
పశ్వధ్యక్ష! రథాంక భక్తు ననుకం♦పం బ్రోవు రాజేశ్వరా! 85

మ॥ అవనీనాథుఁడు రాజశేఖరుఁడు ని♦త్యప్రీతి నీపూజనం
బవలీలం బొనరించి సర్వసుఖ మ♦త్యానందముం జెందె నిన్
గవు లెంద ద్వినుతించి యుండిరొకొ వే♦డ్కం జేయఁగాఁ గోరితిన్
స్తవనీయం బిది మత్కవిత్వము మహే♦శా! యీశ! రాజేశ్వరా! 86

శా॥ జ్యేష్ఠాషాఢములన్ భవన్మహిమ నెం ♦ తే భక్తిఁ జింతించు నా
నిష్ఠాఢ్యున్ వరియించు సంపదల వ ♦ ర్ణింపంగ శక్తుండె యే
ప్రేష్ఠుం జేనియుఁ దావకీన కరుణా ♦ శ్రీ మించ నిష్కర్మతా
నుష్ఠానం బొనరింతు నన్ గొనుము ధ♦న్యుం జేసి రాజేశ్వరా! 87

శా॥ మూలం బెయ్యదియో, యిలాతలమున♦ న్మార్క్షత్వ మందంగ నం
చేలా కొంతవిచారణం బొనరుపన్ ♦ హేవాకము ల్బూనఁగాఁ
జాల న్నీవలనం గృతార్థతను మిం ♦ చ న్నిన్నుఁ బూజింతు నా
శీలం బిట్టిఁడు బ్రోవఁగాఁ దగుఁ జు మీ♦శీఘ్రంబె రాజేశ్వరా! 88

శా॥ పూతం బైన భవత్స్వరూపమును నె♦ప్డు న్భక్తిఁ బూజించి నీ
చేతఃప్రీతిఁ బొనర్చుపుణ్యుఁ డొగి సు ♦ శ్రీమంతుఁడై మించుఁ దా
రోత ల్పూనెడు నాజవంజవమునన్ ♦ లోలాత్ముల న్నీడు నో
పూతాత్మా! భవదీయదాసుఁడను నన్ ♦బోషింపు రాజేశ్వరా! 89

శా॥ ఉద్య ద్భానుసహస్రతేజుఁడు లస♦ద్యోధుండు రాముండు సం
పద్యోగం బెడఁ గోరి కుంభజల స ♦ ద్భవ్యోపదేశాప్తి నీ
పద్యంబు ల్పఠియించి లింగమున ని ♦ న్భావించి పూజించి తా
మాద్యచ్ఛత్రుగణంబు నొంపఁడె నిలిం♦పారాధ్య! రాజేశ్వరా! 90

శా॥ శ్రద్ధాభక్తుల నీసమర్చనము న ♦ శ్రాంతంబు సంధించి సం
పద్ధాముండు కిరీటి పాశుపతమ ♦ న్భవ్యాస్త్రము న్గాంచి యా
యుద్ధప్రక్రియ గెల్పు నొందఁడె? త్వదీ ♦ యు ల్గాంక రెద్దాన నీ
రాద్ధాంతంబు జగద్ధితంబు మము సం ♦ రక్షింపు రాజేశ్వరా! 91

శా॥ ధర్మాత్ముండు శిలాదనందనుఁడు వే ♦ ద్యం బైన నీమూర్తి స
త్కర్మానందముతో భజించి గొనియెన్ ♦ గల్యాణలక్ష్మిన్ జనుః
కర్మంబు ల్నశియింపఁ జేయఁ దగ వేఁ ♦ డ న్నీశ్రీగిరిఖ్యాతిచేఁ
గూర్మి న్నీకొలు వందువాఁ డెవఁడు లో♦గున్స్వామి రాజేశ్వరా! 92

శా॥ శశ్వత్కీర్తి పితామహుండు నిను వి♦శ్వస్తుత్యుఁ గీర్తించి తా
నైశ్వర్యప్రభవాఢ్యుఁడై జగము న♦య్యైకీర్తిఁ జిత్రించి స్వీ
యాశ్వాధ్యాపకుఁ డయ్యె నీయెడల నా♦ర్యానాథ! మాబోంట్లు నే
నైశ్వర్యార్థులు కాక యుండు రెటు ది♦వ్యారాధ్య రాజేశ్వరా! 93

శా॥ ప్రాతం బైన భవచ్చరిత్రము కడుం♦ బుణ్యాత్మునిం జేయు నీ
చేతఃప్రీతిఁ బొనర్చు నర్చనము సు♦శ్రీధన్యతం గూర్పనౌ
భూతాత్మా! భవదీయమంత్ర మది స♦మ్యక్తిం బ్రసాదించు నో
చేతోజాతయమాయమాన నిభృత! ♦ శ్రీనిత్య రాజేశ్వరా! 94

శా॥ ఉచ్చైర్ఖ్యాత భవత్ప్రభావ మది స♦ర్వోపాధికం బయ్యు సం
పచ్చాతుర్యము భక్తసంతతికి నె♦ప్పట్లం బొసంగించు ని
న్నిచ్చం గోరి యజించు మానవులు గా♦ రేకష్టము ల్గాంచనో
సచ్చారిత్రవశంవదా! సకలధీ♦సంపన్న! రాజేశ్వరా! 95

శా॥ రేకెత్తుం గలకాల మీయవని దు♦ర్విజ్ఞేయమైనట్టి నీ
శ్రీకారుణ్య కటాక్ష వీక్షణము ల♦క్ష్మీనాథముఖ్యామరా
నీకప్రాభవదానదక్షమయి వ♦న్నె న్వాసియుం గాంచి స
శ్రీకుం జేయు భవత్సమర్చకుని ధ♦ర్మిం జేసి రాజేశ్వరా! 96

మ॥ అమరంగా స్వకుటుంబయుక్తముగ నీ♦కారాధన ల్సేయు భా
గ్యము గల్గెం గద నేఁటి కోపశుపతీ! ♦ కాన్క ల్సమర్పించి, మ
మ్ము మహోత్సాహులఁ జేయుఁడంచు సతిమి♦మ్మంగోరెసత్పుత్రిదా
సము నర్థించి తదీయవాంఛితము నె♦న్నం బోలు రాజేశ్వరా! 97

శా॥ నీకు స్త్రీసతికిన్ బొసంగు విధివ♦న్నిష్ఠ న్సుతుం గాంచఁగా
శ్రీకల్యాణకటాక్షవీక్షణము ల♦ర్థిం గోరి యర్పించె నిం
దాకం బూవులపూజ లీకొమ మహా♦నందంబు చెన్నొందఁ ద
త్సాక ల్యోట్టక యత్తలోదరిని సం♦రక్షింపు రాజేశ్వరా! 98

మ॥ సతి తాఁ గోరిన కాంక్షితం బఖిలత ♦ స్సంతోషసంధాయి నీ
వతిదాక్షిణ్యకలాంచితుండవు స్వకీ ♦ యారాధ్యభావంబు నీ
మతికిం గోచరమే త్వదన్యులను మే ♦ మా కోర మెప్పాట సం
తతి భాగ్యోదయలక్షణాంచితుల నె ♦ న్నం జేర్చు రాజేశ్వరా! 99

శా॥ దేవా! మీకరుణాప్రవాహకణ మ ♦ ర్థిం గోరి యేడాదికే
శ్రీవిఖ్యాతి జగంబు నిండ నినుఁ బూ ♦ జింపంగ యత్నించు మ
మ్మే వాత్సల్యమున స్మరించెదవొ తం ♦ డ్రీ! నీదు భారంబు మ
ద్భావాంతర్గృహవర్తి వందన మిదే ♦ పాలింపు; రాజేశ్వరా! 100

మ॥ నలువ న్గొంద ఱుపాస్తి సేసెదరు కొం ♦ ద ర్విష్ణుఁ బూజింతు ర
న్యులు దేవళ్ళ యజింత్రు తత్ఫలములం ♦ దు న్లోటు లేదైన, మా
కులదైవం బగు నిన్ను వీడి పెఱలం ♦ గోరంగ రాదంచు, దు
ర్మలవిధ్వంసకముం బొనర్చు శ్రుతి వై ♦ రం బేల? రాజేశ్వరా! 101

మ॥ జననంబు న్మరణంబు గాంచు టది నై ♦ జం బయ్యె విష్ణ్వంబుజా
సనముఖ్యామరు లందు నయ్యది మహా ♦ సంభ్రాంతముం గూర్చు, నె
తని నా భీతి వచింతు నో పశుపతీ! ♦ తత్త్వార్థసంపాదనం
బున నా మానసము న్బిగించి కృపతోఁ ♦ బోషింపు రాజేశ్వరా! 102

మ॥ పురుషశ్రేష్ఠుఁడవై బుధోత్తముఁడవై ♦ భోగీట్కలాపర్థివై
గిరిరాడ్వాసుఁడవై యుమాసఖుఁడవై ♦ గీర్మూర్తివై యొప్పు నీ
చరణాబ్జద్వయ మద్దుకొందుఁ గనుల ♦ న్సద్భక్తి నర్చించెదన్
స్మరియింప న్మఱి యన్యదైవము గిరీ ♦ శా! యీశ! రాజేశ్వరా! 103

శా॥ వ్యాధిగ్రస్తులకు న్గిరిహార్తులకు నీ ♦ యైశ్వర్యరూపంబు సం
బోధించు న్వెనువెంట భద్ర మిడు నె ♦ ప్డు న్శంక యింకేల ? సం
బాధ ల్వాయును గన్నమాత్ర సకలా ♦ పత్సంఘదుర్మార్గసం
రోధవ్యాపకము ల్త్వదంఘ్రులు నిచే ♦ రూ! వీర! రాజేశ్వరా! 104

మ॥ రదనశ్రేణి బలంబునం దనరు కా ♦ లం బాడె, యంగంబు లం
గదఁక న్లొంగని నాఁడె యాత్మతరుణీ ♦ కైంకర్య మున్నప్పుడే,
మదమాత్సర్యకులంబు లొంటు దెసల ♦ న్మల్లాడునానాఁడె ని
న్మద మొప్ప న్వినుతించి నెగ్గవలె ని♦మ్ముంద్రొక్కి రాజేశ్వరా! 105

శా॥ మెల్ల న్మూర్ఖుల యొద్దఁ జేరి కలతా ♦ ల్మి న్వాడి మిన్నంటి యీ
షల్లాభంబునకై స్వకీయకవితా ♦ సారంబు వెచ్చించితిన్
మల్లోపంబు బోకార్చు మయ్యఘము ప్రా♦మం జూడక నీపైని హా!
చెల్లె న్నాగరువంబు నిన్ గొలుతు ర ♦ క్షింపంగ, రాజేశ్వరా! 106

మ॥ శరణంటిం గరుణింపు మంటి నిను నా ♦ చందంబు వర్ణింప, దు
ష్కర సుంటిం బరమేష్ఠి కేని మఱి యీ ♦ సంసారకాలాహిభీ
కరదంష్ట్రాగ్నిశిఖావిజృంభణమునన్ ♦ గారింపఁ బో కీతనిన్
భరియింప స్టగు సర్వకాల మని ని ♦ న్బ్రార్థింతు, రాజేశ్వరా! 107

శా॥ ఆఱు న్మూఁడును మూఁడు నొక్కఁడు తురు ♦ ష్టాబ్దమ్మున న్భక్తి యొం
తే రాణింప బిరాన నేఁడు శివరా ♦ త్రి న్నీదరిం జేరి యిం
పారంగా శతకంబుఁ జెప్పితి నమం ♦ దానందముం జెంది, నీ
పారణ్యాలయవాసినీదయిత భ ♦ వ్యం బిమ్ము, రాజేశ్వరా! 108

శా॥ కౌండిన్యర్షి సగోత్రుఁడ న్సకలలో ♦ కధ్యేయ వేమార్య వం
శ్యుండ న్భక్తుఁడ నయ్యవారి సుతుఁడ ♦ న్మద్ధాత్ముఁడన్ వీరభ
ద్రుండ న్నే శతకంబుఁ గూర్చితిని దో ♦ త్రో నీకె యర్పించితిన్
జెండం జూడుము నాదుదోసములు ని ♦ న్సేవింతు రాజేశ్వరా! 109

మ॥ భవ! శర్వా! మృడ! రుద్ర! శంకర! శివా! ♦ ఫాలాక్ష! మృత్యుంజయా!
సవవిధ్వంసక! దక్షగర్వహరణా! ♦ సాంబా! మహాదేవ! మా
ధవవంద్యా! రజతాద్రిమందిర! మహా ♦ త్మా! మమ్ముఁ బాలింపు మం
చు వివేకుల్సతము న్భజింత్రు విషభ ♦ క్షున్నిన్ను రాజేశ్వరా! 110

శా॥ ఆలిం గోల్పడి యష్టకష్టముల ధై♦ర్యం బేది ప్రారబ్ధ క
ర్మాలం గీడ్వడి యొక్కటెన్నఁ గనకీ ♦ మాలర్కముం జెంది ని
న్నోలిం గొల్చెడిబుద్ధి పుట్టకయ యె ♦ ట్లో కాలవిక్షేప మీ
లీలం జేసెడు నన్నదో విధిఁ గపా♦లీ! ప్రోవు! రాజేశ్వరా! 111

మ॥ ఇలువేల్పంచును దల్లిదండ్రులు గురుం ♦ డెంతేఁ బ్రబోధింప నం
జలి బంధంబు ఘటించి భక్తిమెయి న ♦ శ్రాంతంబు బ్రార్థించి మే
ల్కలుము ల్గూర్చుకుమారుఁ గోరనది వే♦డ్కందార్చి యప్పాటనా
కులకాంత న్విడఁ గొట్ట గాసిలితి లో ♦ కు ల్నాడ రాజేశ్వరా! 112

మ॥ తనయుం డొక్కఁ డతండు తల్లి చనుబా ♦ ల్ద్రావంగ నోమండు నా
కును మూణ్ణాళ్ల కుమారుఁ గాంచఁ గడుసం ♦ క్షోభంబు వాటిల్లె నా
తని నింకెట్లు ధరింతు? తల్లి గలదా? ♦ దాక్షిణ్య భావంబు నం
గని నీవే భరియింప వేఁడెదను నా ♦ కర్మంబు రాజేశ్వరా! 113

మ॥ తొలి నీపూజ లవెట్లు చేసితినో? యెం ♦ దుం గాన నీవారు నా
వలెఁ బత్ని న్విడనాడి కుందుటలు శ ♦ ర్వా! నామొరాలించి మిం
చి లలిం బుత్రునకైన మేలిడి చిరం ♦ జీవిత్వముం గూర్పుమో
లలితాహృజ్జలజార్క! వందనశతా ♦ లం దార్తు; రాజేశ్వరా! 114

శా॥ శ్రీకంఠు న్సుకుమారుఁ గూర్చితివి వా ♦ సిం జెంద నీభక్తున౯
శ్రీకల్యాణము లందఁ జేసి సుతునిం ♦ జేపట్టి రక్షింపుమో
శ్రీకల్యాణగిరీంద్రధన్వి! నిను న ♦ ర్థిం బూలఁ బూజింతు నే
నాకాంక్షింప నిఁకన్యమేదియు నజే♦డ్యా! జోత రాజేశ్వరా! 115

శా॥ తండ్రీ! కూర్చితి వొక్కనిం గొమరు నా♦దౌర్భాగ్యముంబట్టిమా
వాండ్రెల్ల న్విలపింపఁ దల్లి చనె ని ♦ బ్బాలు న్భవద్భక్తు నే
నీండ్రంబుం గొని పెంచు లాగెటుల నో ♦ యీ! భ్రామరీనాథ! నీ
వుండ్రా ల్పెట్టుము దానవృద్ధిఁ గని మో♦ట్లో మెట్టు రాజేశ్వరా! 116

మ॥ సకలామ్నాయముల న్హరించి జగము ♦ న్సంభ్రాంతముం జేయుసో
మకుని న్శఫరమూర్తివై తునిమి యా ♦ మ్నాయంబు లందించిబ్ర
హ్మకు; లోకంబుల హానికిం గడగు ప ♦ ద్మాక్షున్నిం బ్రశాంతింపఁ జే
యక యున్నం గలదే జగంబు? కృతకృ ♦ త్యధ్యేయ! రాజేశ్వరా! 117

శా॥ క్షీరాబ్ధ్యున్మథనార్థకచ్ఛపము నై ♦ శ్రీకాంతుఁ డుద్యత్సుధా
పూరంబు న్దైగఁద్రావి దేవనికరం ♦ బు న్దుర్దశ ల్గూర్ప నా
ఘోరంబు ల్విని యేకదంతు వలనన్ ♦ క్షోభంబు వారించి తో
పారావారనిషంగ సంగత ! కృపా ♦ పారీణ ! రాజేశ్వరా! 118

మ॥ అమరానీకము నోంచి మించెడు హిర ♦ ణ్యాక్షు న్వధింపంగ సం
భ్రమణం బొప్ప రమామనోహరుఁడు వా ♦ రాహంబు రూపంబు నం
ది మదోన్మత్తు వధించి యాతని సురా ♦ నీకంబు రాపాడఁగా
సమితోత్సాహముతోడ నేలితి, వహో ♦ ర్యావాస! రాజేశ్వరా! 119

మ॥ సురలం గావ హిరణ్యరాత్రిచర సం ♦ క్షోభంబు వారించి శ్రీ
హరి తా శ్రీనరసింహుఁడై దనుజర ♦ క్తాస్వాదముం జేసి ని
ర్జరుల న్వంపఁగ శారభాకృతిని దా ♦ ర్జన్యంబు వారించి తో
హరం! నీసాటి మఱేరి వేలుపుల? కు ♦ య్యాలింప, రాజేశ్వరా! 120

మ॥ ఘను వైరోచనునోంచి యింద్రునకుఁ బ్ర ♦ ఖ్యాతి స్వరాజ్యంబుఁగూ
ర్ప నవోన్మేషముఁ జెంది వామనుఁడునై ♦ పద్మాక్షుఁ డాకార్య మం
దు నిరాఘాటతఁ గూర్చి యింతయి మఱెం ♦ తో పెద్దయై పెద్దయై
తనర న్శాంతునిఁ జేసి యేలవె జగ ♦ త్తండంబు రాజేశ్వరా! 121

మ॥ జనకాజ్ఞ న్జననీశిరం బణఁచి దీ ♦ క్షం దత్కటాక్షాప్తివై
జనని న్జీవితఁ జేసి శైవుఁ డయి ప ♦ జ్ఞం దల్లి నింద్యం బ్రపూ
జనముం జేసె, వధించె సర్వనృపులన్ ♦ క్ష్మాదానముం జేసె నీ
చనుమానంబున భార్గవుండు విధువా ♦ సం బందె రాజేశ్వరా! 122

శా॥ శ్రీనాథుండు దశాస్యు నొంచి సురలన్ ♦ శ్రీమంతులన్ జేయఁగాఁ
దానే రాముఁడునై జనించి దివిష ♦ త్కార్యంబు సాధించియుం
జానొందం దగ వాజిమేధమున ని ♦ స్సంతృప్తుఁ గావింప నో
సూనాస్త్రాంతక! నీదుభక్తుఁ డెటు లో ♦ చ్చున్గాంచు? రాజేశ్వరా!123

మ॥ వసుదేవాత్మజుఁడై బలుం డనఁగ న ♦ ప్పక్షీంద్రవాహుండె యా
రసనాభార మడంపఁ బుట్టి తనకా ♦ ర్యం బెల్ల నెగ్గించి సా
ధ్వసభక్తు ల్దగ నీమర్చన మని ♦ ర్వార్యంబుగాఁ జేసి నీ
యసకృద్వీక్షణభాగ్య మంది నిజధి ♦ ష్ణ్యం బందె రాజేశ్వరా!124

శా॥ మాకాంతుండు వసుంధరాభర మణం ♦ ప ద్దేవకీపుత్రుఁడై
నాకేశాదులు వేఁడఁగాఁ బొడమి ప ♦ న్నాగంబు సాగించి సు
శ్లోకుం డయ్యుపమన్యుబోధఁ గొని యీ ♦ శు న్నిన్ను మెప్పించి త
ల్లోకంబుం గొనె నీదుభక్తుల కిఁకే ♦ లోపంబు? రాజేశ్వరా! 125

మ॥ భువనంబు ల్భరియింప మ్లేచ్ఛనికరం ♦ బుం ద్రుంప విష్ణుండు గ
ల్క్యవతారంబును దాల్చి దుర్జనుల వే ♦ గ న్నాశముం జేసి స
ద్వ్యవసాయంబున శైవలింగమగు ని ♦ ధ్యానించి పూజించి ది
వ్యవరంబు ల్గొని చేరె నైజపద మా ♦ ర్యానాథ! రాజేశ్వరా! 126

మ॥ గిరులం బిండి నొనర్త్రు; నీరనిధులం ♦ గ్రీఁజేత వారింత్రు పు
ష్కరభూము ల్వడిఁ దాటుమా అగునటు ♦ ల్గావింత్రు వాణీశ ని
ర్జరనాథప్రముఖామరాళిని దృణ ♦ ప్రాయంబుగా నెంత్రు దు
ష్కరమేమున్నది నీదుకింకరుల కో ♦ సర్వజ్ఞ! రాజేశ్వరా! 127

శా॥ జ్ఞానంబు న్గగనేచరత్వము ననూ ♦ నత్వంబు నైశ్వర్య సం
ధానంబుం బరమార్థదృష్టి బహుసం ♦ ధానిత్వము న్సత్కవి
త్వానందంబు, విదూరసంశ్రవణ ము ♦ త్క్రాంతంబు నాముక్తి యెం
తేనిం గల్గెడు సుప్రసన్నుఁడవుగా ♦ నీవైన ; రాజేశ్వరా! 128

మ॥ భవులు న్నిన్భగవంతు శాశ్వతముననే ♦ న్భావించి పూజింత్రొ సం
భవదుఃఖంబది వాయు వారికి నను ♦ త్పద్మాత్త పద్మాసన
ప్రివరాభ్యర్చితమూర్తులుం గలుగుదు ♦ ప్స్రాపించిక భ్రాంతి మ
ద్వ్యవసాయంబుఁ బొకార్పజోత లివి, నీకర్పింతు రాజేశ్వరా! 129

శా॥ రవ్వంతైన సుఖం బొసంగునొ; మనో ♦ రాజ్యంబుఁ బాలించు నో
మవ్వంబు న్ఘటియింపఁ జేయునొ, లస ♦ న్మాహాత్మ్యముం గూర్చునో
క్రొవ్వుం బోకడవెట్టి దుర్దశకుఁ జీకుం గూర్చి రక్షించు నో
అవ్వం బాపునొ యాజవంజవపు భా ♦ రం బేల? రాజేశ్వరా! 130

శా॥ ఎన్నండో స్మృతి గల్గు సత్య మది నే ♦ డేఁ రేపయేని న్వితా
పన్నాగం బనుచుండుఁ బండితులుఁ దాఁ ♦ బ్రాల్మాలునిఁ గొల్వకే
మన్న న్లాభము లేనికృత్యముల న ♦ త్యర్థంబు సాగించు నా
యన్నా! యెట్లు తరించు నీప్రజ దురా ♦ హాన్నాప్తి రాజేశ్వరా! 131

శా॥ కామక్రోధముల న్మనంబు సెడి చీ ♦ కాకైతి వెన్నాడి నీ
శ్రీమాహాత్మ్య మెఱింగితి న్గురులు దా ♦ రిం జేర్ప మిన్నందితిఁ
స్వామీ! నాకుఁ గృతాపరాధునకు నీ ♦ వాల్లభ్యమే తక్క యే
నోము ల్గావని సాక్షివృత్తి దెలుప ♦ న్రోఁగాడు రాజేశ్వరా! 132

శా॥ చిత్తస్థైర్య మొసంగి సత్కవిత వా ♦ సిం గూర్ప నీవండగా
మత్తిల్ల న్భవదర్చనాభిరతి ధ ♦ ర్మప్రక్రియుం గూర్చి నా
సత్తావృత్తము లెంచి ప్రోవఁగల నీ ♦ సామర్థ్యమేఁ గాంచి కిం
చిత్తైన న్భయ మందఁ బో నవల ర ♦ క్షింతీవె, రాజేశ్వరా! 133

మ॥ గురులు న్గాంత్రు ముదంబు బాలకుల వా ♦ క్కు ల్విన్నమాత్రాన ను
ర్వర నావాక్కు మలీమసం బయిన నిఁ ♦ రంజింపఁగా హేతువై
పరఁగు న్నీగుణకీర్తనంబు కలనం ♦ బ్రాపించు పుణ్యంబుచే
నరగుం గాత భవాంతరంబునను నీ ♦ సద్భక్తి; రాజేశ్వరా! 134

శా॥ వాగీశుండవు పార్వతీపతివి ది ♦ వ్యజ్ఞానయుక్తుండ వీ
వాగు న్బాగు నెఱుంగలేని కవితో ♦ ద్యోగంబునం జేయు నీ
యోగం బెట్లు ప్రియంబునై వెలయు నీ ♦ కోదేవ! నాభక్తి సం
వేగం బియ్యది సేకరింపనగు స ♦ ద్విఖ్యాతి; రాజేశ్వరా! 135

శా॥ సాంబా! నీదగు భక్తసంతతికి భ ♦ వ్యం బబ్బుఁగాత; న్నిరో
గం బౌఁగావుత వారిపుత్రులకు దీ ♦ ర్ఘాయుష్యసంపత్ప్రి లా
భం బౌఁగాత భవత్సమర్చకులకు ♦ న్బాలాళికిం బ్రేమ న
న్నుం బాలింపు మటంచుఁగొల్చెదను జి♦న్మోదాత్మ రాజేశ్వరా! 136

శ్రీ రాజేశ్వరార్పణమస్తు.

శ్రీ రాజేశ్వర శతకము సంపూర్ణము.





శ్రీరస్తు

శ్రీ చంద్రమౌళీశ్వరస్వామినే నమః.

# శ్రీ చంద్రమౌళీశ్వరశతకము.

శ్రీమద్దివ్యకలార్చితం బఖిల దు ♦ ర్గ సింధు కుంభోద్భవో
ద్ధామం బాద్యము వాక్పతీడ్యము నమ ♦ త్స్వర్గాపవర్గావహ
శ్రీమాన్యం బరివర్గదుర్గ్రహము ల ♦ క్ష్మీశనాథభావ్యంబు నీ
శ్రీమాహాత్మ్యము మమ్ము నోముత గవ ♦ గ్రీ చంద్రమౌళీశ్వరా! 1

శా॥ ముద్యోగం బిడు నెంచుమాత్రమున ని ♦ ర్మూలించుఁ బాకంబున
ద్విద్యాస్థం బ్రబలీకరించు సకలో ♦ ద్యం గీర్తిఁ బ్రాకించు నా
నుద్యద్వైరివిదారకంబు నిజమం ♦ త్రోచ్చారణం బంచు నే
నాద్యు ల్సన్నుతిసేయ వింటి ననవ ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా! 2

శా॥ లుప్తం బయ్యె మదీయపంక మభవా! ♦ లోలోనఁ బంచాక్షరీ
దీప్తప్రక్రియ నెంచువాఁడనగుటన్ ♦ దేవాదిదేవు న్నినున్
గోప్తన్ గా హృదయాబ్జపీఠమునఁ గో ♦ ర్కుల్మీఱఁ బూజించుటన్
బ్రాప్తశ్రీకు నొనర్చి యేలు బుధవం ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా! 3

మ॥ గురుఁ దాడేపలి వేంకటప్పయకవిం ♦ గొండాడి సద్భక్తి నీ
శ్వరిఁ దత్స్వామి మహేశు నిన్బ్రగడి శ ♦ శ్వత్ప్రీతి నన్ బ్రోచు పు
ణ్యారమం దల్లిని సుందరాంబ ఘనున ♦ య్యన్ స్వయ్యవాగ్లాహ్వయున్
గరిమన్ గొల్చి రచింతు నీశతక మ ♦ న్నా! చంద్రమౌళీశ్వరా! 4

శా॥ వేసంబుల్ గొనకే భవద్భజన ము ♦ ర్వీన్ సర్వకాలంబు సం
త్రాసం బింతయు లేక చేసెదను వి ♦ ద్యానాథ! నీయంద యా
వాసం బేర్పడ మన్మనోగతికి భ ♦ వ్యత్వంబు సంధింపు మే
నాసింప న్మతి యన్యమేదియు నజే ♦ డ్యా! చంద్రమౌళీశ్వరా! 5

శా॥ ప్రత్యూసంభృత కంకణుండ వని ధీ ♦ రవ్రాత మగ్గింప సం
రక్షింపం దొరకొందు భక్తతతి ధై ♦ ర్యం బేది వోకుండ నీ
వీక్షామాత్ర జగత్త్రయంబు వోలుచు ♦ న్విశ్వేశ నిన్వీడ నా
దీక్షం దెల్పితి వేఱుగాదు పుషితా ♦ ర్థీ! చంద్రమౌళీశ్వరా! 6

శా॥ భక్తిం దావకపాదపంకజము న ♦ భ్యర్థించు వా రిద్ధరన్
ముక్తిం గాంతు రనామయాఢ్యులయి స ♦ మ్మోదంబు పైవాఱ నీ
యుక్తిం బెద్దల సత్కటాక్షముల నె ♦ ట్లో కాంచి మిన్నందితిన్
సక్తిం బ్రోవుము భక్తు నన్నితరు నెం ♦ చం జంద్రమౌళీశ్వరా! 7

శా॥ ద్రవ్యం బిమ్మని కోరఁ గోర కరు ల ♦ ర్వంబు ల్సమృద్ధార్థముల్
దివ్యస్ఫూర్తి నెసంగుహర్మ్యములు నేఁ ♦ డెమ్మంచు నర్థింప సం
స్తవ్య న్సత్కవితాకుమారిక లస ♦ త్సంస్కారశోభాంచితన్
భవ్యం జేయుము నీకడ న్నెగడ సాం ♦ బా! చంద్రమౌళీశ్వరా! 8

మ॥ కలిగెం ద్వత్కరుణాలవంబున భవ ♦ త్కైంకర్య మందాస్థ నా
తొలి జన్మంబునఁ గూర్చికొన్న తప మెం ♦ తో చెప్పఁగా శక్యమే?
లలితేశా! భవదీయ భక్తుఁడను గా ♦ లం బెట్లు వెళ్లించెదో?
లలి నన్నేలుము నిన్నుతింపఁగనుఁ జా ♦ లం జంద్రమౌళీశ్వరా! 9

శా॥ విశ్వంబుల్ సృజియింపఁ బెంప నణఁప ♦ న్విఖ్యాతమై యుండునో
విశ్వాతీత! భవత్ప్రయత్నలవ ము ♦ ర్విన్ మాదృశుల్ వాణి నీ
శశ్వత్కీర్తి నుతింపఁ జాలుదురె? దీ♦క్షం జాలిరే వైనతే
యాశ్వాదుల్? కృపచేఁగనుంగొనుము తీ ♦ ర్థ్యా! చంద్రమౌళీశ్వరా!

మ॥ కృతకృత్యుల్భవదర్చనాంచితులు మా ♦ దృక్తాపవిచ్ఛిత్తి సం
తతబోధామృత సత్ప్రసక్తి వెస న ♦ త్యర్థంబుఁ గావించి య
ద్భుతమాహాత్మ్యముఁ గూర్చువా రగుట సం ♦ తోషంబుతో భక్తసం
తతిఁ ద్వద్భావనఁ బూజసేసెదను వృ ♦ ద్ధా! చంద్రమౌళీశ్వరా! 11

మ॥ తరమే నీమహిమం బొగిం బొగడ హ్మా ♦ ద్యప్రక్రియల్ భారతీ
శ్వర వైకుంఠసురాధినాధులకు న ♦ వ్వాణీరమేంద్రాణికా
సరసీజాక్షులకున్? జడుండ నగు నే ♦ సాధింతు నెప్పాట నీ
కరుణాలేశమ కోరువాఁడ ధృతగం ♦ గా! చంద్రమౌళీశ్వరా! 12

మ॥ మునులు న్నిర్జరులు న్ధరామరులు ధ ♦ ర్మ్యల్ చక్రవర్తుల్మహా
ఘనులౌ రాజులు వైశ్యసత్తములు స ♦ త్కారార్హులయ్యంఘ్రిజుల్
ధనధాన్యాంచితులైరి నీభజన మ ♦ త్యర్థంబు సాగించి యం
చని పౌరాణికవాణి పల్కు మహనీ ♦ యా! చంద్రమౌళీశ్వరా! 13

మ॥ శితికంఠాయ! నమో నమోభగవతే ♦ శ్రీశైలవాసాయ తే
క్షితికన్యాపతి పూజితాయ, మహతే ♦ శీతాంశుచూడాయ తే
కృతకృత్యార్చితపాదుకాయ గురవే ♦ కీర్త్యంచితాంగాయ తే
స్తుతిపాత్రాయ నమోనమో యనుచు నెం ♦ తుంజంద్రమౌళీశ్వరా!14

మ॥ శ్రుతిపారాయణముం గవీణ్ణుతి మహా ♦ రుద్రాభిషేకోత్సవం
బతిమోదావహపుష్పపూజనము ది ♦ వ్యానేకనైవేద్యసం
భృతి యొక్కొక్కెడ సోమవాసరమునం ♦ బొంపొందు నీకోవెలం
గృతకృత్యుల్నినుఁగొల్చి కాంచెదరు ము ♦ క్తింజంద్రమౌళీశ్వరా!15

శా॥ ఏదేవళ్ల మొగంబుఁ జూడ; నిఁక నే ♦ నేమైననిన్వీడ; నీ
వే దిక్కంచు వచించువాఁడ; వినుతు ♦ ల్వేయేలనీవాఁడ; నీ
పాదాబ్జంబులు నమ్మినాఁడ; మఱినీ ♦ వాదేల? నన్నన్న వాఁ
డా! దర్వీకరలోకపాలక కలా ♦ పా! చంద్రమౌళీశ్వరా! 16

శా॥ జ్యోతిష్టోమములన్ ఫలింపని ఫల ♦ స్తోమంబు ; దివ్యన్నదీ
ప్రాతస్స్నానములం బొసంగని మహా ♦ రాజ్ఞీకటాక్షంబు వి
ఖ్యాతక్షేత్ర తపోవిశేషము లొసం ♦ గంబోని మోక్షంబు, సం
ధ్యా తాదాత్మ్య సమర్చనం గను నరుం ♦ డౌ; జంద్రమౌళీశ్వరా! 17

శా॥ నీపాదాంబుజసేవ మానను మది ♦ న్నీధ్యానమున్వీడ, నీ
వా పాఱుండవు దేవులందు మఱి నే ♦ నా! పాఱుఁడ న్మర్త్యులన్
నీపారమ్య మెఱింగి వెంటఁబడితి ♦ న్నే నేరిఁ బ్రార్థింప నీ
ప్రాపుంగోరితి నన్నుఁ బ్రోవఁగదె రు ♦ ద్రా ! చంద్రమౌళీశ్వరా ! 18

శా॥ అంచద్రీతి నటించుమామక మనో ♦ హంసంబు జేపట్టి య
త్కించిద్భీతిని మాంచి నీచరణ పం ♦ కే జాతముం దార్పఁగా
నెంచంగా వలెఁ ద్వత్కటాక్షకలనా ♦ హేవాకపాకప్రథన్
మించంగా వలె నీదుభక్తుఁడను మం ♦ త్రీ చంద్రమౌళీశ్వరా ! 19

శా॥ బంటుంగా నను నేలికొమ్మనుచు నిన్ ♦ బల్మాఱు ప్రార్థించి క్రే
గంట న్నీవు కృపారసం బొలుక నేఁ ♦ గంటి న్మహాదేవ! నీ
కంటె న్మిన్న జగాన లేఁడనుచు దీ ♦ క్షం జాటుచున్నాఁడ ము
క్కంటీ! నేను గృతార్థసత్తముఁడఁ ద్ర్య ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 20

శా॥ ప్రాతస్స్నానమునన్ విభూతి ధరియిం ♦ పన్ మాలికల్గ్రాల్ప వి
ఖ్యాతస్తోత్రములం బఠింప నతుల ♦ త్యంతంబొనర్ప న్గుణో
ద్భూతి న్వైదికపూజసేయ మఱియే ♦ పుణ్యంబులార్జింప నీ
చేతోమోదముకల్గు ఏమిట నగున్ ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 21

మ॥ అభయంబిచ్చు సమస్తభక్తతతికె ♦ న్దాయుర్యశోభాగ్యముల్
విభవంబు ల్సమకూర్చు నీకరుణ య ♦ న్విఖ్యాతి విన్నాఁడ నో
యిభచర్మాంబర! వందనంబులివె నా ♦ కెంతేజయంబిచ్చి యీ
శుభవాక్యాప్తినె తృప్తిఁ జేకొనుము భి ♦ క్షూ! చంద్రమౌళీశ్వరా! 22

శా॥ వేదాంతార్థ మెఱింగిన న్నిగమసం ♦ వేద్యంబు సాధించిన
న్మోదంబేదఁగ నష్టకష్టముల నా ♦ మోదించి సన్నిష్ఠమై
పాదాంగుష్ఠము మోపి భూస్థలిని ని ♦ ల్వాంజాలినన్ జేస్పనీ
శ్రీదాక్షిణ్యములేక సిద్ధికలదే? ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 23

మ॥ సవము ల్సేసినఁ, గుండలంబులను దీ ♦ క్షం బూనినన్ శాస్త్రవా
దవిధానంబుల నెగ్గినన్ నిఖలవే♦దశ్రేణి భావార్థము
త్సవ మొప్ప న్వినిపించిన న్గురుకటా ♦ క్షం బింతలేకున్న, నీ
శివతత్త్వం బెఱుఁగంగఁజాలరు గదే? శ్రీచంద్రమౌళీశ్వరా! 24

మ॥ నను రక్షించెడు దాత వీవని మహా ♦ నందంబుతో నిన్నె నా
మనమందెంచి భవత్పదాంబుజము సం ♦ భద్భక్తి నర్చించు చుం
టిని నావిన్నప మాలకించి కలసం ♦ దేహంబు బోకార్చి యొ
య్యన నీభక్తుని నన్నుఁబ్రోవఁదగు న♦య్యా! చంద్రమౌళీశ్వరా! 25

మ॥ సతతంబున్ స్థిరభక్తిఁ దావకపదా ♦ బ్జంబర్థిఁబూజింప ను
ద్యతుఁడౌవాఁ డఘపూరితుండె యయి నం♦దాల్మిం గటాక్షింతువన్
కతలాలింపఁగ వేదపారగులు వ ♦ ర్ణ్యాణింప నామానసం
బతిమోదంబు వహించెఁ బ్రోవగదె యా♦ర్యా!చంద్రమౌళీశ్వరా!26

మ॥ తనసంతోషము సర్వలోకసుఖ సం ♦ తానంబ యౌ నిద్ధరన్
దన దుఃఖంబె గుజాండభాండ నికరో ♦ ద్యద్దుఃఖ సంపాదియౌఁ
దన వైదుష్యము దివ్యబోధకల నా ♦ ర్థ ప్రాపకం బౌనటం
చును నెవ్వాఁడువచించు సంభృత♦సుధాంశూ!చంద్రమౌళీశ్వరా! 27

మ॥ ఇలువేల్పై యలరారు నీదు పదమే ♦ యిూడ్యంబు మావంగడం
బుల నేబాలునకైనఁ గాని యిడె మా ♦ పుణ్యాం బగణ్యాంబు నీ
చలువంజేసి సమస్తసౌఖ్యముల న ♦ శ్రాంతంబుఁ బెంపొందుమ
మ్ములఁద్రోక్కింకరపంక్తి లెక్కఁగొను మ♦య్యాచంద్రమౌళీశ్వరా!28

శా॥ ము న్నాదక్షుఁడు మూర్ఖుఁడై నినుఁ గడు ♦ నోమ్మోటమున్వీడితా
నెన్నన్ రాని దురుక్తులాడి కులమం ♦ దెప్పాట హీనుండవౌ
దన్న న్వాని మదం బణంచి కృప న ♦ త్యర్థంబు రక్షించి తీ
వున్నారే? సురలెందుఁ దత్సములు బా ♦ బూ! చంద్రమౌళీశ్వరా! 29

శా॥ లోకంబు ల్ద్రిటిలోన ముంపఁగను గ ♦ ల్లోలావళుల్ పెంచి భూ
మ్యాకాశంబులు ఘూర్ణిలన్ గరిమ న ♦ య్యైమాద్రి నుప్పొంగుభీ
మాకారంబునుగొన్న గంగఁ ద్రిజగ ♦ ద్ధ్యాన న్నివారింపఁగా
నీ కేశాటవిఁ గట్టుకట్టితి వత ♦ స్ద్రి చంద్రమౌళీశ్వరా! 30

మ॥ అమృతంబుం దెగఁద్రావఁగా నమరుల ♦ త్యాసక్తిమై వచ్చి సం
భ్రమముం జెందిరిగాని, లోకహితము ♦ న్భావించి హాలాహలం
బమితం బొక్కరు మ్రింగఁజాలిరె త్రిలో ♦ కాధీశ! విశ్వాతిశా
యిమహత్త్వం బది లేదొకొండ్లకుఁ గపా ♦ లీ! చంద్రమౌళీశ్వరా! 31

శా॥ మాపున్ రేపునుఁ ద్వత్పదాబ్జరస ము ♦ న్మత్తత్వముం గూర్ప నా
శ్రీపత్యబ్జభవాదిదేవతలు సు ♦ శ్రీభోగ సంపత్తి యె
ప్డేపాటన్ క్షణభంగురంబనుచు నె ♦ న్నేసార్లు నిందించి నీ
ప్రాపుందాపు గణింత్రు నెమ్మది సురూ ♦ పా! చంద్రమౌళీశ్వరా ! 32

మ॥ పరమేష్ఠిత్వముఁ గేశవత్వము సుప ♦ ర్వాణాధిపత్యం బిలా
సురభావం, బమరత్వముం, బితృత, భి ♦ క్షుత్వంబు, యక్షత్వమున్
ధరణీశత్వము, సర్వదక్షత, యని ♦ త్యం బెన్న సౌఖ్యంబులే
దరయన్ నీపదభక్తి ముక్తినిడు సూ ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా ! 33

మ॥ మతిమన్ముఖ్యులు శాస్త్రవేత్తలు మహా ♦ మాన్యుల్ చతుర్వేద సం
తతు లష్టాదశసత్పురాణము లనం ♦ తంబుల్ స్మృతుల్ శాస్త్ర స
మ్మతి నర్థమ్ము లెఱింగి భక్తతతి సం ♦ భావించి నీసేవ సం
తతమోదావహ యంచుఁ దెల్పిరి మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 34

శా॥ పన్నెండేఁడు లపత్యముం బడయ నిన్ ♦ బ్రార్థించి శ్రీకృష్ణుఁ డు
ద్యన్నిష్ఠం దపమాచరింప సుతు ది ♦ వ్యశ్రీయుతుం గూర్చ్చ నీ
కన్న న్మిన్న జగాన లేఁడ నెడి ప్ర ♦ ఖ్యాతిం దగం గంటి వో
యన్నా! యెందును నీకు నీవె సరియౌ ♦ నౌఁ! జంద్రమౌళీశ్వరా! 35

శా॥ ఒక్కం డర్చితుఁ జేసె బూజిడుచు వే ♦ ఱొక్కండు ఱాల్దెచ్చి తాఁ
జక్కం బూంచె మఱొక్కఁ డెంతయును నో ♦ జన్ బిల్వలక్షార్చనల్
పెక్కుల్గూర్చి భజించె నొండను ఫలా ♦ పేక్షన్స్మృతిన్మెచ్చుచున్
గ్రుక్కెం బుక్కిటిమాంసమిందఱును ము ♦ క్తుల్ చంద్రమౌళీశ్వరా! 36

మ॥ ఘనమోహాంధ్యమ దొక్కరాజునకు వే ♦ డ్కం గూర్చె సత్పుత్రిపై
మన మారాటముఁ జెందెఁ బుత్త్రికయు న ♦ మ్మం బోనిదై చేరి ని
న్ననుకంపాంచితుఁ గొల్చె మల్లెలను దా ♦ హాయిన్గనె న్మల్లికా
ర్జునవిఖ్యాతి గణించి తీవటు నిచే ♦ రూ! చంద్రమౌళీశ్వరా! 37

శా॥ తల్లిందండ్రులు లోకర్తు బాలికను బో ♦ ధల్సేసి యందుంచి దా
రెల్లన్ శ్రీగిరి కేగఁ గుంచమునుఁ బా ♦ లే వేళ నీకిచ్చుచున్
జెల్లంబో నినుగొల్వ వారొలసి దా ♦ నిన్నమ్మకే కొట్టరాన్
మెల్లన్నీ దరిఁజేరఁ బ్రోచితివి వ ♦ ర్మీ! చంద్రమౌళీశ్వరా! 38

మ॥ మతవైరుధ్యము లేటికో? యుపనిష ♦ న్మార్గభ్రమం బేటికో?
వితతార్థేచ్ఛ లపేటికో? పుడమి దు ♦ ర్విజ్ఞాను లౌటేటికో?
మితయోగస్థితు లేటికో? కపటసం ♦ భేదాఢ్యు లౌటేటికో?
కృతకృత్యు ల్గన కీవిధంబులఁ బినా ♦ కీ! చంద్రమౌళీశ్వరా! 39

మ॥ గురుడై తానుపదేశ మీయనగు బ ♦ ల్కుం దేనె జాల్వార దు
ర్భర మజ్ఞానముపేడ శిష్యులకు ని ♦ ర్వాణప్రదార్థంబు నా
ర్ద్వ్యరఁ బోదోలుటయున్ ఘటింపనగుఁ గో ♦ ర్కుల్దీఱ మోక్షేచ్ఛఁడా
గురుఁడౌ కాండులభింపఁడే యొడలమా ♦ ఱుం చంద్రమౌళీశ్వరా! 40

శా॥ వేదాంతంబఁట యుచ్చఁగూఁతురఁట యు♦ర్విం గొంద ఱాచార్యులై
పాదాంభోజ జలంబు లిత్తు రఁట దా♦ ర్భాగ్యంబు దేవార్చనం
బీఁదఁగ రాదని హెచ్చరింతు రఁట హా! ♦ యింకెట్లు నీపూజ లీ
మీఁదం గల్గుఁ దరింత్రు మానవులు సా♦మీ చంద్రమౌళీశ్వరా! 41

మ॥ కలి మాయంబడి వేదచోదిత విధు♦ ల్గావింపఁగానేర కే
యలసు ల్గొందఱు, తత్త్వవేత్తలము చుం♦ డాయంచుఁ గర్మంబు లి
మ్ములమాయింతురు గాని, భోగ్యవిషయ♦మ్ము ల్వీడఁగాలేరు సా
మ్ములనార్జింతురు ముక్తిఁగాంతురటె శం♦భూ! చంద్రమౌళీశ్వరా! 42

శా॥ శాక్తాచారమె ముక్తిదంబని లస♦చ్ఛబ్దార్థవాగ్ధోరణి
శాక్తేయు ల్వచియింత్రు వైష్ణవులు శా♦స్త్రప్రక్రియ న్వైష్ణవ
ప్రోక్తం బయ్యది యండ్రు శైవు లదియె♦ ప్పూర్ణ శైవభాష్యాంచిత
వ్యక్తిం జేసి త్వదీయ మండ్రెదియొ శ♦ర్వా! చంద్రమౌళీశ్వరా! 43

శా॥ సందేహంబులుగూర్చువాదము లవి♦ శ్వాస్యంబులౌట న్మనం
బందగ్గింపక న్యాయ్యమార్గ మిదె నీ♦ యందైక్యభావం బటం
చుం దాత్పర్యమున న్మెలంగి యొకచో♦ శుష్కించుచు న్భ్రష్టమా
చందంబందఁ జొరండు ముక్తుఁ డలికా♦క్షా! చంద్రమౌళీశ్వరా! 44

శా॥ ఎన్నో మూర్తుల నెన్నొ రీతులను ని♦న్నే శాస్త్రరాద్ధాంత స
పన్ను ల్బ్వాంచిన నీదువ్యక్తులనియే♦ భావింతు నవ్వాని వే
ఱున్నే? సర్వగతుండ వీవగుటచే♦ నుత్సాహసంపత్తి నో
యన్నా! నీభజనంబు వీడ గిరివా♦సా! చంద్రమౌళీశ్వరా! 4

శా॥ సత్యం బేమఱఁ జేసి ధర్మము నెడ♦ న్సంకోచముం గాంచఁడే
నత్యంతాదర ముంచునేని భవదీ♦యాకారమం దెప్డు సా
హిత్యశ్రీ భవదర్చకోత్తముల సా♦మ్మే తాను నీవాఁడై సాం
గత్యార్హుండు త్వదీయభక్తుఁ డనలా♦క్షా! చంద్రమౌళీశ్వరా! 46

మ॥ అసురానీకము బారి కోర్వకె యమ ♦ ర్త్యౌఘంబు గౌరీశ! మా
పస దూలె న్నలిఁ బ్రోవుమంచును భవ ♦ త్పాదాంబుజాతద్వయి
న్వేసఁగొల్వన్ దనుజావలిన్దునిమి వే ♦ వే భద్రముల్గూర్చి తీ
వసముం బెంచితి వెల్లలోకముల నూ♦ర్వ్యా! చంద్రమౌళీశ్వరా! 47

మ॥ శివ! శంభూ! నగజామనోహర! హరా! ♦ శ్రీకంఠ! విద్యేశ్వరా!
సవనాశా! వృషభాశ్వ! శంకర! మహే♦శా! శాంత! మృత్యుంజయా!
భవ ! భక్తార్తివినాశ ! శర్వ ! కరుణా ♦ పాథోధి ! భూతేశ | రు
ద్ర! వరిష్ఠా! కరుణించిప్రోవు మివెజో♦తల్, చంద్రమౌళీశ్వరా! 48

శా॥ శ్రీరామామణి సేవితాంఘ్రికమలా! ♦ శ్రీకంఠ! విశ్వేశ! యోం
కారాకార! పవిత్రనామ! వృషభాం ♦ కా! దేవదేవా! ప్రభూ!
పారావారనిషంగ! శంకర! కృపా ♦ పారీణ! నన్నిట్లు సం
సారాంభోనిధి ముంపఁగా నగునె? యీ♦శా! చంద్రమౌళీశ్వరా! 49

శా॥ యుక్తాయుక్త వివేకశూన్యత సము ♦ ద్యోగంబు యోగంబుగా
సక్తిన్నేమదినెంచి దాస్యము నిర ♦ స్యంబంచు లోనెంచకే
ముక్తింగూర్చు నటంచుఁ బొల్పడితి సా♦మ్యుంగోరి యీపాట్లకై
భక్తత్రాణధురీణ! చూడుము భరిం♦పం జంద్రమౌళీశ్వరా! 50

మ॥ పరముం గూర్పఁగ నేన యుంటిభృతకో♦పాధ్యాయతంగాంచుచుం
చు రహింఁ జొన్పిటి దాన జీవనము న ♦ క్షోభంబుగా నొప్పుచుం
గర మానందమొసంగఁ బూర్వభవనం ♦ స్కారంబునంజేసి యు
ద్ధుర పత్నీవ్యథ గల్గె దీన బడలిం ♦ తో చంద్రమౌళీశ్వరా! 51

మ॥ క్షితి నెన్నండు భవత్సమర్చకుల వీ ♦ క్షింపంగలే దిట్టిదు
ర్గతి నాకొక్కని కేల గల్గెనో? భా ♦ రం బెట్లుపోకార్తో? సం
స్తుతులుంజేసెద వ్రాసెద న్మతియు నెం ♦ తో భక్తి నినొల్చెదం
గృతకృత్యుం బొనరించి ప్రోవవె నిషం♦ గీ! చంద్రమౌళీశ్వరా! 52

మ॥ కలిగెం దావక సత్కటాక్షమున జో ♦ కన్నందనుం డొక్కఁ డెం
దుల కీతండు త్రిరాత్రమాత్రమున బ ♦ ద్దుఃఖంబు మాతృవ్యథా
కలన న్గాంచె దలంప నయ్యది యెఱుం♦గ న్వానిదో?నాదొ? యీ
ఫల మెట్లేనగు నిద్దఱిం గలఁప న ♦ ప్పా! చంద్రమౌళీశ్వరా! 53

శా॥ ఎవ్వాండేని భవత్కటాక్ష మెపుడే ♦ ట్లేఁ గోరి యీరీతిఁ దా
నొవ్వాండంచు నెఱుంగుదు న్దురిత మెం ♦ తో యింతకార్జించి నే
నొవ్వంగంటిని దీని నీమెలుపున ♦ న్నగ్గాడుదుంగాని న
న్నవ్వాం జేయుము పుత్త్రిఁబ్రోచు నెటి నా♦న్నా! చంద్రమౌళీశ్వరా! 54

శా॥ ఓకారుణ్యపయోధి! నీకరుణ నె ♦ న్నో సౌఖ్యము ల్గాంచి సు
శ్లోకుండై యలరారుఁ గౌతముని బా ♦ లు న్మానుతు న్వేడ్కమై
శ్రీకంఠాఖ్యుఁ బొనర్చితిక్ మఱవకో ♦ శ్రీకంఠ! నీ[illegible] న
వ్వోఁకన్నమ్ము భరింప నీవసుమి యు ♦ ర్విం జం[illegible]ద్రమౌళీశ్వరా! 55

మ॥ ఒక సంవత్సర మేగెఁ బుత్త్రునకు [illegible]యుద్యత్కృపాదృష్టి నెం
తకునే నిట్టులె చూడగాఁ దగుదు హ్రా ♦ ద్యత్ప్రక్రియక్ భక్త పు
త్త్రకు నీకృత్యమ యిద్ది వేఱొకరి కి ♦ ద్దానక్ లపంబేని నెం
దుకు వాటిల్లుఁబ్రసక్తి యిట్లనియె కౌ ♦ ల్తుం జంద్రమౌళీశ్వరా! 56

మ॥ పరమప్రీతి నొసంగి తీవొకసుతు ♦ న్బచ్చ్య న్భవన్నామ బం
ధురు శ్రీకంఠునిఁ బెంచుచుంటి వికఁ నెం ♦ దు న్లోటురానీక సం
బరముం జెందుచు దాన, నీపదముల ♦ న్భావించి సేవించు చుం
టి రహిక్ శాశ్వతమిట్లుప్రోవు మనుచుం♦టిం జంద్రమౌళీశ్వరా! 57

శా॥ లగ్గుం గాంత్రు భవత్సమర్చకులు ధీ ♦ రశ్రేణి కొండాడఁగా
దగ్గు ల్పెచ్చులు లెక్కసేయకయె భ ♦ క్తవ్రాతముం బ్రోచు నీ
పగ్గె న్మెచ్చుచు బాలునేలుమని ని ♦ న్బ్రార్థింతు నేఁప్రొద్దు నీ
దగ్గుంజూచి భయాన నుర్వుడు మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 58

శా॥ నీ పాదోదకము న్సభక్తిఁ గయికొం ♦ టి న్నీప్రసాదంబు నే
నాపోవన్భుజియించితి న్స్మృతులయం ♦ దాగూఢి నిన్గాంచితి
న్నీపేర్వెట్టితి మత్తనూజునకు నే ♦ నీలింగముం దాల్చితిం
బ్రాపై ప్రోవఁగ నేమియంతరము దే♦వా! చంద్రమౌళీశ్వరా! 59

మ॥ స్తుతి నారంభముసేసి యం దొకట నీ ♦ క్షోభంబు వర్ణించి తీ
వతిదుష్టుండ వటంచు నెంచకుము నే ♦ నారాధ్యుఁడంగాన నిం
దితుఁడంగాను మతేరిఁగోర ననుఁ గీ ♦ ర్తిన్గానవే భక్తుడన్
ధృతి నన్గాచుట నీదుధర్మ ముపవీ ♦ తీ! చంద్రమౌళీశ్వరా! 60

మ॥ ఇలువేల్పువని విన్నయంత మన మొం ♦ తేఁ బ్రీతిఁ బొంగారు న
ర్మిలిఁ బాలింతు వటంచు దాన నిటుపే ♦ ర్మిం జిత్తగింపంగ మం
జులరీతి న్మొఱవెట్టితిం గసటదె ♦ చ్చో లేదు మత్పూనునిం
గలకాలంబు భరింప నీవ సుమి త్ర్య ♦ క్షా! చంద్రమౌళీశ్వరా!61

శా॥ భక్తి న్నీచరణాబ్జము ల్గొలుచు ని ♦ ష్పాపుండ నేఁగాన నా
సక్తి న్నీకడ నాచరిత్రముల స ♦ త్సందర్భశుద్ధి న్వినన్
వ్యక్తింగూర్చితి నాదొసంగుల దయ ♦ న్వారించి పాలించు సం
రక్తిం దావకభక్తుఁడన్ శరణులు ♦ గ్రా! చంద్రమౌళీశ్వరా! 62

మ॥ జయముం గూర్తొ? పరాజయం బిడుదొ? యీ♦షల్లోపముల్లేక నీ
కయి సద్భక్తిఁ బొనర్తు నీశతక మ ♦ య్యా! సత్కలాశూన్యుఁడన్
దయకుం బాత్రతఁ జెందఁగోరితి లస♦ద్దాక్షిణ్యభావంబు నా
కయి వెచ్చింప నొకింతచాలును ప్రసాద♦య్యా!చంద్రమౌళీశ్వరా63

మ॥ తొలుతంగల్గినపుట్టు లెట్టివొకొ? నేఁ ♦ దోరంపుమోహాన నం
దులఁ గావించినకిల్బిషంబు లెవియో? ♦ త్రోవంగ నేఁజాల న
న్నలి నన్బ్రోవుము యిదొక్కఁడే జననము ♦ న్మెలెంచుచుంటింగృపా
కలశాబ్ధి! న్నినుఁ గొల్చుమేల్మి వృషభాం♦కా!చంద్రమౌళీశ్వరా!64

శా॥ గాత్రం బెంతకు నీక్షితి న్నిలుచు నగ్ ♦ గారాముపై నంతకుం
బాత్రత్వంబు ఘటించి నిల్పు కరుణా ♦ పాథోనిధానంబవై
స్తోత్రంబు ల్పచరించుచుందుఁ గొలుతుగ్ ♦ క్షోభంబువారించి సం
ధాత్రాగాఢత ముక్తిఁగూర్పు గిరిధ ♦ న్వా చంద్రమౌళీశ్వరా!65

మ॥ కరపాదాదులు నైజసత్వమున వీఁ ♦ క నీ్నీయకార్యావళుల్
పరఁగం దా మొనరించుచున్నపుడె స ♦ ద్వ్యాపారదీక్ష న్నిరం
తరము న్గోష్ఠి నొనర్పఁగాఁదగును మా ♦ ర్తాండప్రకాశంబునం
దరయంగావలె గాదె యెల్లయును గు♦ల్యా! చంద్రమౌళీశ్వరా! 66

శా॥ సంతోషంబును జెందునప్పుడు మహా ♦ శ్చర్యాను సంధానముగ్
సుంతైనం గనిన ప్రతీంద్రియసుఖ ♦ స్ఫూర్తుండనౌనాఁడు ని
శ్చింతత్వంబున యోగలక్ష్యమున వా ♦ సిం గాంచు నప్పట్ల ధ్యా
నింతు న్నాహృదయాబ్జపీఠమున మా ♦ నీ చంద్రమౌళీశ్వరా! 67

శా॥ ఎవ్వండే సకలేశుని న్విడిచి య ♦ ర్థేశాదులం గామ్యపుం
మవ్వాన న్భజియించు వాఁ డిహమున ♦ న్మాన్యత్వముం బాసి యం
దెవ్వల్పా పెడు శారవం బెనయు నం ♦ చేవింటి శ్రుత్యర్థ మీా
వివ్వాంజాలవొ సర్వసౌఖ్యములఁ దం ♦ డ్రీ! చంద్రమౌళీశ్వరా! 68

శా॥ ఏదుర్బుద్ధివచించు నేమెడ సముం ♦ డీశాన దేవుండు దా
నా దేవావలి కంచు నాతఁ డగున ♦ య్యా! మాలఁ డమ్మాలఁ డొం
డీదారిం గొనఁడేని గాఁడనియు నా ♦ హేమాద్రి నాదిత్యుఁడే
వాదింపం గని సంతసించితిని భ ♦ వ్యా! చంద్రమౌళీశ్వరా! 69

మ॥ కరుణావారిధిఁ జంద్రశేఖరు నుమా ♦ కాంతుగ్ మహాదేవు శం
కరు నిన్నెవ్వఁడు వీడి యన్య నిజపా ♦ త్కంజంబునం గూర్చు నా
నరుఁ డొండొండన యెండమావులను గా ♦ నంగాంచి గంగాజలం
బు రహిన్వీ రెడువాఁడయందురు మహో♦భూ! చంద్రమౌళీశ్వరా!70

మ॥ భవదీయాంశజనించువాఁడయిన స్వ ♦ ల్పంబైన యాయుష్యసం
భవభూతిం దనరారి తేఁడనని దు ♦ ర్వాదంబుల న్మించు మర్క
శవణిల్లక్షణమాత్ర సాన్వయుఁగ నా ♦ టన్నాశముర్ జేయుదో
శివ! నీసేవ యువేద్య మేరికయిన ♦ స్మృ చంద్రమౌళీశ్వరా! 71

మ॥ ప్రబలె న్నాస్తికఘోరణు ల్మృతిమత ♦ ప్రారంభ సంరంభము
ల్పబువు లూన్నడమి నస్తమించెఁ గులము ♦ ల్పాడయ్యె వేదంబులక్
దబిసీల్సేసిరి దుర్భవు ల్మజియుఁ బు ♦ ణ్యక్షేత్రవర్గంబులం
దుబుకుల్వీడిరి సజ్జను ల్గతి యిఁకె ♦ ట్లో చంద్రమౌళీశ్వరా! 72

మ॥ గురుఁ బూజింపని శిష్యులు న్విబుధులం ♦ గొండాడఁగా లేని ము
ష్కరులుం బెద్దలఁ దద్దగొల్వని ప్రజా ♦ కాండంబు భక్తి న్నిర
న్తరము న్నాధుని సేవసేయని సతు ♦ ల్నానాఁటికి న్హెచ్చు దు
స్తరమాఁ దద్భజనంబెయిక్కలిఁ బ్రప♦ఢ్యా! చంద్రమౌళీశ్వరా! 73

మ॥ కొలువంజాల సహస్రభాస్కరసదృ ♦ క్షు న్నిన్నుఁ బ్రాంతంబునం
బిలువం జాల మునీంద్రబృందవచనా ♦ విర్భూతు భూతాత్మకు
న్విలువంజాల సమస్తవస్తుపరిపూ ♦ ర్ణీభూతు నిన్నొక్కటర్
నిలువంజాలుము మన్మనోబ్జమున ధ ♦ న్యా! చంద్రమౌళీశ్వరా! 74

శా॥ నీలింగంబును గాంచుఁ గన్నులలర ♦ న్నీసత్కథాశ్రేణిఁ దా
నాలించుం జెవులార నిన్దలఁచు వి ♦ ద్యాస్థాన సంవేద్యుఁగాఁ
దూలంబాఱు విగర్హ్యవర్తనుల యం ♦ దుం జూట్కి వాటిల్ల నీ
లీలం బొల్చుఁ ద్వదేకశీలుఁడు కపా♦లీ! చంద్రమౌళీశ్వరా! 75

మ॥ భవదీయామల సత్కథావళుల న ♦ బ్రంబైన సద్భక్తితోఁ
జెవులార న్వినిపించువారిఁ గొనునా ♦ శ్రీమంతులం గాంచి దు
ర్భవపంకాత్ములు వీరుగారని మహో ♦ రక్తిం బ్రశంసించి కా
లవశు ల్దూతలు మిన్నకేగెదరలో ♦ లా! చంద్రమౌళీశ్వరా! 76

శా॥ సర్వోత్కృష్టుఁడవై జయింపుము శివా! ♦ శంభూ! మృడా! శంకరా!
యుర్వీభృత్ప్రభుజామనోహర! నమ ♦ ద్యోగీంద్ర సంరక్షణా!
సర్వజ్ఞా! శశిఖండమండన! గిరీ ♦ శా! సత్కృపాక్షీరధీ!
శర్వా! జగ్గయపేటవాస! సకలే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 77

మ॥ పరమోపాయకథాప్రసక్తిజడుఁడన్ ♦ భావంబు దుఃఖాత్మమౌ
శర మెంతే నొగి మోదె దాన శరణ ♦ స్థానంబు శ్రీచంద్ర శే
ఖరు నీశు న్నిను జొన్పితిం గరుణమైఁ ♦ గాపాడుమ మ్మిందిరా
వరనేత్రార్చిత! ధన్యత న్గనెద దే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 78

మ॥ ఘనమై యంతటఁ బర్వి దృష్టికి మహా♦గాధంబుగా మౌఢ్యసం
జ్ఞను దామిస్ర మడంప భాస్కరుని యో ♦ జన్నైజతేజంబుతోఁ
డను డెందంబను నాకసంబునఁ గడున్ ♦ డంబంబునన్ వేఫు మో
దిననాథోత్తమ బింబమధ్యగతమూ ♦ ర్తీ! చంద్రమౌళీశ్వరా! 79

మ॥ శివ! నీమార్గముఁ జర్మదృష్టిని సమీ ♦ క్షింపంగ నేఁజాల నో
భవ! దానం గరుణాంచితంబభయద ♦ ప్రఖ్యాతమౌ చూడ్కి వే
గ విలోకింపఁగదయ్య మమ్ము నిను వే♦డ్కంగొల్తు మేప్రొద్దు సం
భవదుఃఖంబుఁబొకార్పు మ్రొక్కులివె యో♦మ్యా! చంద్రమౌళీశ్వరా!

మ॥ నెలదారీ! కుతి నీదురూపుపయి నెం ♦ తేఁ దోఁచె మున్నద్ది సం
కలితాలంకృతి సద్గణేడ్య మని వక్కాణించి రాపైఁ గవుల్
కలుగుం బాలనుఁ దీపు పుట్టుక నె చ♦క్కం జక్కెఱల్గూర్ప న
వ్వల స్వారస్యము వృద్ధిఁజెందుగద దే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 81

మ॥ సెకకంటీ! విసమాని యన్నెరి మృతిం ♦ జేకొంటివే? రుండమా
లికలం దాల్చి పవిత్రతన్ సడలితే ♦ లీలాభవాఖ్యుండవై
సకలక్లేశభవార్తిఁ బాపవె శుభా♦స్థం బెంపవే యట్లు చే
సికనుల్గల్గినవాఁడవయ్య సమదృ ♦ ష్టిం జంద్రమౌళీశ్వరా! 82

మ॥ గిరిశా! శూలధరుండవయ్యును విరో ♦ ధిత్వంబుఁ గైకొంటివు
ద్ధురవైరాగ్యరతుండవైన నినుఁ జెం ♦ దుఁగ రాగి భావంబు బం
ధురసద్భక్త్యచరుండవేని నిను నెం ♦ దుం జేరరె నీశత్వ మీ
సరణి న్నీచరితంబు చిత్రము నటే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 83

మ॥ పరలోకోన్నతి ప్రాప్తయానపుటిక ♦ ల్పక్షోణిజం బిచ్చు ద
బ్బరపుంగోర్కులు శివా నిన్నుఁ బూసహ్రా ♦ ద్యాగంబునం జేర్చి సుం
దరి పాదాంబుజముల్ భజించు గుణవ ♦ ద్ధన్యు న్మహాభోగిగాఁ
గరుణం జేయు దశేషవాంఛలిడి సే♦వ్యుం జంద్రమౌళీశ్వరా! 84

మ॥ శమనధ్వంసక! యెంతలో యముడు న ♦న్బాధింపఁగాఁ గాలపా
శముతోఁ గట్టునొ, యెంతలో నభయము♦న్సంధింపుమా? వేగ నే
మమతోఁ గొల్తు నిసత్యజీవునకు న ♦ మ్మందేల నీప్రాపు నే
నమితానందముతోడఁ బొందితిని దా ♦ రా! చంద్రమౌళీశ్వరా! 85

మ॥ విషముం గ్రక్కెడు భీమపన్నగము ల ♦ న్విఖ్యాతిఁ గన్పట్టి దు
ర్విషయంబుల్గాని పెద్దకాయముల ను ♦ ర్విం బెక్కుగాయంబు లా
మిష గన్పట్టఁగఁ బుట్టున న్నమృతస ♦ మ్మోదంబునిం బోల్చు ను
న్నిమిషదంచద్రసదృష్టిఁ జేర్చు మిఁక స్వా♦మీ! చంద్రమౌళీశ్వరా! 86

మ॥ కరుణావారిధి వీవు మానసతతిఁ గ ♦ న్గంట న్గటాక్షించు చో
నరుదా? కాంక్షితసర్వముల్గాని మహీ♦యస్త్వంబుఁ దాఁగంట ము
ష్కరసంసారభయంబు నాఁగ నను నీ ♦ కంట న్వీక్షింపు మో
దురితారణ్య దవానలా! నిను భజిం ♦ తుం జంద్రమౌళీశ్వరా! 87

శా॥ దేవా! యెవ్వనిపాదము ల్గొలుతునే ♦ నక్కొన్వరం చెంచు దు
ర్నీ వాల్లభ్యముఁ గోరునా కితరుఁ డు♦న్నే నిత్యదీనావన నుం
డీ విశ్వంబునఁ ద్వద్వియోగిజన మె ♦ ట్లీక్షించుఁగాంతా మయం
బీ విశ్వంబని గాంతుఁ ద్వన్మయము గా యుం♦చేఁ జంద్రమౌళీశ్వరా! 88

శా॥ నానారీతుల భక్తసంతతులఁ బు ♦ ణ్యాంబు ల్ఫలింపంగ నీ
శానా! ప్రోచితి వెందఱెందఱనొ? నన్ ♦ సం రక్షితుం జేయ జా
గౌనా న్యాయ్యము? మందరంబు నటు మో ♦ యంజాలు తా మేటికిన్
బూనంగాఁ బరమాణు వెంతలగు బా ♦ బూ! చంద్రమౌళీశ్వరా! 89

మ॥ ఘనదూరస్థుఁ డటంచు నెంచు నెడ నీ ♦ క్రమోత్తమాంగంబు చు
ట్టు నదూరస్థము పున్కపేరు, మఱిగో ♦ డుం బెంచెదే న్నీ యెడం
గన నా హాలహాలంబు దుర్జనుల సాం ♦ గత్యంబు రూపించెదేఁ
జనునీయందు ద్విజిహ్వాధారణము మే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 90

మ॥ ఎటుదృష్టిం గడఁగింతు నేమనుదు నే ♦ నెచ్చోటవర్తింతు సం
కటభీతాత్ముఁడ నెందునిల్చితివొ దీ ♦ ను న్నన్ను రక్షింపు దు
ర్ఘట మీకార్య మటంచు నెంచకుము శ ♦ ర్వా! నీదరిం జేరితిన్
దటకాపాటును జెందఁజేయకుము వే ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా! 91

శా॥ నేల న్దొల్లుదునా యెడందప్రిదుల ♦ న్నిర్ఘాతముంగూర్తునా?
కేలన్దుల్చెదనా శిరంబు తెగి దుః ♦ ఖత్వంబుగో నేడ్చుచా
భీలారావ మొనర్తునా మఱియు నె ♦ జ్బే! యేమిసేయ న్మహా
కాలా! భక్తుఁడఁ బ్రోవఁగాఁ దగుదు వే ♦ గం జంద్రమౌళీశ్వరా! 92

మ॥ శివ! శర్వా! శశిశేఖరా! మృడ! హరా! ♦ శ్రీకంఠ! మృత్యుంజయా!
భవ! దేవా! సుఖదా! మహేశ్వర! కృపా ♦ పారీణ! నమ్రుండనై
తివరా! నన్గ్రుపఁజూడు శంకర! కప ♦ ర్దీ! నీకు నేమ్రొక్కెదన్
దివిషద్వందిత సర్వకాలముపుల ♦ స్త్రీ చంద్రమౌళీశ్వరా! 93

మ॥ శరణం బా తరుణేందుశేఖరుఁడు వి ♦ శ్వస్తుత్యుఁడౌ శంభుఁడే
శరణం బా గిరిరాజకన్యక నమ ♦ త్సర్వామరీవర్గమే
శరణం బొండొకఁ డుండఁబో దనుచు నా ♦ స్వాంతంబునం దెంతుమీ
కరణంబిచ్చితి మేను మున్నె హరి కే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 94

శా॥ అంబాధీశ! ప్రసన్నతం గను ప్రప ◆ న్నార్తిచ్ఛటాచ్ఛేదకా!
సాంబా! శూలి! ప్రసన్నతం గనుము వి ◆ శ్వారాధ్య! విశ్వేశ్వరా
బింబాస్థాన! ప్రసన్నతం గను శివా! ◆ భీమేశ! గంగాధరా!
తుంబుర్వర్చిత! యేలు సంసరణ భీ ◆ తుం జంద్రమౌళీశ్వరా! 95

శా॥ నీవల్ల న్జనిఁ గాంచు నీజగ మొగి ◆ న్నీయందె నిల్చుం దతిన్
శ్రీవాల్లభ్యముఁ గౌరి మించుఁ దుదిఁ దా ◆ క్షీణించు నెళ్లే వినా
శావిర్భాతులు నీయెడం బడయు స ◆ ప్తాఘంబు భూమింబలెన్
శ్రీవిద్యజ్జన మానసాబ్జ వసతీ! ◆ శ్రీ చంద్రమౌళీశ్వరా! 96

శా॥ లోకేశుండు సురేశ్వరుండు వసువు ◆ ల్రుద్రు ల్దిశానాయకు
ల్నాకుల్ యక్షులు సిద్ధసాధ్యులును గం ◆ ధర్వు ల్నదీసంఘము
ల్నాకౌకఃప్రవిరోధు లంబుధులు గాం ◆ తారంబు లయ్యద్రులున్
లోకాధీశ్వర! సర్వము న్నిలుచు నీ ◆ లోఁ జంద్రమౌళీశ్వరా! 97

శా॥ నీమాయాకలితంబు విశ్వ మిది వ ◆ ర్ణింపంగ నీయందె యి
చ్ఛామాత్రంబునఁ దోఁచునంచు బుధు లెం ◆ చంజాలి రీమాద్రి స
ద్ధామా! రజ్జువునం దహిభ్రమయు కా ◆ న్నద్యంబె యీమర్మ మో
స్వామీ! ముక్తుఁ డెఱుంగునంద్రు నిగమా ◆ శ్వా! చంద్రమౌళీశ్వరా! 98

శా॥ తేజఃఖండముల న్జగం బఖిల మ ◆ ర్థిం బూర్తిఁ గావించి బ
త్తేజోరాశివ కాఁ బ్రకాశిలుదు వో ◆ లింగార్తు వద్దానికే
యోజమ్మొం ద్వదుపేక్షకత్వమున నె ◆ ట్లో యేగు నీవిశ్వ మిం
కేజాడ న్గనరా దటం చనెద వ ◆ క్ష్మీ చంద్రమౌళీశ్వరా! 99

శా॥ స్థూలార్థంబు భరింప నల్పుఁ డెటు శ ◆ క్తుం డయ్యెడిన్ వింధ్యమున్
శైలం బెత్తఁగ స్తంబకీటమునకున్ ◆ శక్యంబె యీవిశ్వమే
లీలన్ దాల్చితో గర్భయంత్రమునఁ ద ◆ ల్లింగంబు నీమాయ యం
చోలిం గాంచితి సత్యమియ్యది ధృతేం ◆ దూ! చంద్రమౌళీశ్వరా! 100

మ॥ ఎటులారజ్జువునన్భుజంగము భయం ♦ బెంతే వెసం గూర్చునం
తటఁజూడ న్గనరాదు లేదు విలయ ♦ స్థానంబుఁ దాఁ జెందదే
మిటి కీజాడఁ బొనర్చి తీజగమునె ♦ మ్మి న్నైజమాయాంధ్య మం
చిటు నీమూర్తినిఁ గాంచి మించితి విషా♦శీ! చంద్రమౌళీశ్వరా! 101

మ॥ అవిచారాంచిత మిద్ది లోకముల కే ♦ స్ఢాధారభావం బుమా
ధవ! నీదేహము గాంచునంత మదవి ♦ ద్యం గల్గె నెన్నంగ నీ
కెవ్వనే దేహము? నీవు పూర్ణుఁడవు ని ♦ త్యానందరూపుండ నో
శివ! మత్స్వాంతసరోజగేహవసతీ! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 102

శా॥ పూజేష్టంబులు పూర్తదానములు నాఁ ♦ బొల్పారు భవ్యక్రియ
త్తేజస్విత్వము గోరు మానవులకుఁ ♦ దివ్యత్ఫలం బిచ్చునం
చోజరి బల్కెడి పల్కులే మృషలు నా ♦ నోనాన్న! నీకన్న వే
తే జాడంగన రాఁడొకండు యెటులెం ♦ దేఁ జంద్రమౌళీశ్వరా! 103

శా॥ అజ్ఞానుల్ మునులా? వచింత్రు బహుపూ ♦ జాచార బాహ్యక్రియల్
ప్రజ్ఞంగూర్చి పొనర్చువాఁడు గను భ ♦ వ్యస్థాన మన్పల్కు ది
వ్యజ్ఞానం బటుగాక గల్గునె యమూ ♦ ర్తా! నీకు భోగేచ్ఛ యే
సుజ్ఞానంబొడఁగూర్చి చేయుమి కృతా♦ర్థుం జంద్రమౌళీశ్వరా! 104

మ॥ ఒకమారూర దళంబొ; కొంచె ముదకం ♦ బో; కొంచు భక్తాళికి
న్నకలంబౌసిరి సంఘటింతు వనుట ♦ ల్సత్యేతరంబు ల్మహా
త్మక! విద్యాస్పద మిద్ది గాదనుచు నెం ♦ తు న్మామకస్వాంత మం
దొకట న్నీపదపద్మము ల్గొలుతు నే ♦ నో చంద్రమౌళీశ్వరా! 105

శా॥ విశ్వం బెల్లెడ దిక్కుల న్విదిశల ♦ న్విఖ్యాతితో నుందు వా
పశ్వారూఢ! పురాణపూరుషుఁడవై ♦ బ్రహ్మాదు లగ్గింప నీ
యైశ్వర్యం బిదిగాదు నా న్ఘటమునం ♦ దాకాశ మెట్లట్లు నీ
శశ్వద్భావమె సాక్ష్య మిచ్చెదుఁ బరే♦శా! చంద్రమౌళీశ్వరా! 106

శా॥ ఆకాశంబుననున్న సూర్యుఁ డెటు ల ♦ య్యై నీరపాత్రంబులం
దేకాత్ముండై యనేకభావమున నెం ♦ తే నొప్పుచొప్పించి యు
స్తోకు న్ని న్నఖిలాంతరాత్మలను సం ♦ శోభింతువం చందు నో
శ్రీకాంతార్చిత పాదపద్మయుగళా! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 107

శా॥ పుట్టింపం బెనుప న్లయంబొనరుప ♦ న్భూతేశ! నీకర్జమె
ప్పట్టుం న్నెట్టఁగఁ బో దమైనఁ దనుభృ ♦ ద్వారంబు నాద్యంతమై
మట్టున్నిలు నదృష్టపుంజముల న ♦ మ్మార్గానిరాని యద్దానిఁ గ
న్పట్టం జేయుదు స్వప్నముంబలె సురూ♦పా! చంద్రమౌళీశ్వరా! 108

శా॥ స్థూలంబై మఱి సూక్ష్మమై జడమునై ♦ శోభిల్లు దేహద్వయం
బేలాగాంచును జేతనత్వ మధి వి ♦ ద్యేశాన! యద్దాన దా
నోలిం గూర్చెడి వేద మెన్న సుఖదుః ♦ ఖోక్తిం ద్వయారోపణం
బోలక్ష్మ్యర్చితపల్లవాంఘ్రియుగ! శం♦భూ! చంద్రమౌళీశ్వరా! 109

శా॥ శ్రీకంఠాయనమో నమోస్తుగురవే ♦ శ్రీసచ్చిదంభోధిహాం
సాకారాయ నమ స్సమస్తకలుషా ♦ హారాయ తుభ్యంనమః
సాకారాయ పరావరత్వమహతే ♦ వ్యాయోగకర్త్రే నమ
శ్శ్రీకాలాయ యటంచు నిన్బొగడుదుర్గా♦శ్రీ చంద్రమౌళీశ్వరా! 110

మ॥ ఉపమన్యుండు రఘూద్వహుండు నిను వి ♦ ధ్యుక్తప్రకారంబు త్వ
త్కృప గాంచ న్వినుతించి మించిరను ప్రా ♦ గ్గీతోక్తి నాలించి యా
త్రిపదా న్నామకవాణి తదుచ్చిర మా ♦ ర్గం బంది తచ్ఛాయ గ
ల్గి పృథూల్లాసమునీంకుఁ గూర్పుత కపా♦లీ! చంద్రమౌళీశ్వరా! 111

మ॥ అన్నం బన్న విసంబు, భూషణము లా ♦ హా! సర్పము ల్వస్త్రమి
క్లన్న న్వారణకృత్తి సేలువ లెయ ♦ య్యో! వ్యాఘ్రపుం దోలు, సం
పన్నంబైన వృషంబు వాహనము నీ ♦ సౌభాగ్య మేగోర లే
కున్నాఁడన్ దృఢభక్తియిమ్ము కఁడో శం♦భూ! చంద్రమౌళీశ్వరా 112

మ॥ కరు లిమ్మంటినో బంధురాశ్వగణముం ♦ గాంక్షించినానేమొ బం
గరు తేరు ల్గరుణింపుమంటినో యనే ♦ కశ్రీ విడంబించు కా
ల్వుర నిమ్మంటినొ రాజ్యభోగముల కూ ♦ ర్పుంగూర్పుమన్నాడనో
స్థిరభక్తిస్థితిఁ గాంక్షసేసితి శివా! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 113

శా॥ పోగుల్గోరను? గోరనే బిరుదము ♦ ల్భూషావళుల్ గోరనే?
లాగుల్గోరను గోరనే కుబుసము ♦ ల్లావణ్యముం గోర సు
శ్రీ గుణ్యంబులుఁ గోర గోరఁజుమి ల ♦ క్ష్మీస్త్రీలాలనోల్లాసముల్
త్యాగం బింతకు భక్తిగూర్చెకద ♦ య్యా! చంద్రమౌళీశ్వరా! 114

మ॥ తొలుత న్జన్మము లెత్తినాఁడ నటులే ♦ దోషంబులార్జించి నాఁ
డ లవంబేనియుఁ గూర్చ రీర్ష్యమొయినం ♦ డద్దండ లెవ్వారు ని
ర్మలమౌనీవర భృత్యభావమును నే ♦ మం బొప్పఁ గైకొంటి నే
డలఁతు న్లోకము గడ్డిపోచగను వం ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా! 115

మ॥ అరదంబు ల్గరు లశ్వము ల్సబలసై ♦ న్యశ్రేణి శూరత్వము
న్ధరణీశత్వము వేదపారగత శా ♦ స్త్రప్రౌఢవాగ్ధోరణీ
గరిమం బుజ్జ్వలకాంతి సత్త్వము మహా ♦ కావ్యప్రణేతృత్వ మిం
పురహించు న్భవదాశ్రితావళికి బా ♦ బూ! చంద్రమౌళీశ్వరా! 116

మ॥ సరసాహ్లాదివచశ్చమత్కృతి మన ♦ స్సంతోషసంవృద్ధి సుం
దరకన్యాపరిచర్య పండితకవీం ♦ ద్రత్వంబు శైవత్వ మీ
శ్వరపూజాపరిపాటి రాజపరిష ♦ ద్వాల్లభ్య మీశిత్వముం
బరగుం దావకభక్తసంతతికి సాం ♦ బా! చంద్రమౌళీశ్వరా! 117

మ॥ పగలు న్రాతిరి నీసమర్చనము శం ♦ భద్భక్తిసంయుక్తి నే
ను గతాహంకృతి సేయఁగా నటేఁగి న ♦ న్నుం బ్రోవ శంకించెదే
నిఁ గలిం దావకభక్తసంఘమున వ ♦ న్నెల్వాసులుం గుంగు నీ
కుఁ గరం బబ్బెడిఁ జెడ్డపేరు శ్రుతభి ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 118

మ॥ హరిదశ్వుండుదయింప నగ్నిభమృగాం ♦ కాదిప్రభాపుంజము
ల్ధరణీభృద్ద్రుమాలందు దూఱుగతి నీ ♦ దాస్యంబు సద్భక్తిభా
సురమార్గంబునఁ దేజరిల్లఁగను సం ♦ శ్రోతవ్యమంతవ్య మం
త్రరహస్యజ్ఞత లూరకే చనును శ ♦ ర్వా! చంద్రమౌళీశ్వరా! 119

మ॥ అరిషట్కంబు దృణీకరించియు యమా ♦ ద్యష్టాంగసంపత్తి ను
ద్ధురయోగాభ్యసనం బొనర్చియు మహా ♦ స్తోత్రంబులం బాడియుం
గొఱగాఁడెట్టెఁడయేని భక్తివిధి నీ ♦ కుం గూర్చు ముక్తుండునై
పరగుం బెద్దలమార్గ మియ్యది సురూ ♦ పా! చంద్రమౌళీశ్వరా! 120

మ॥ జనుఁ డెవ్వండు భవత్సమక్షమునఁ దే ♦ జఃపుంజమాలానురం
జనమౌ దీప మొసంగు నాతనికి ది ♦ త్స న్సర్వమోహాంధకా
ర నిబర్హాద్రదిమానుషంగికము బా ♦ రమార్థ విజ్ఞాన సం
జనజ్ఞాన మొసంగి యేలెదవు త్ర్య ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 121

మ॥ భవదీయామల పాదపంకజయుగీ ♦ న్భక్తిం బ్రపూజించు పు
ష్పవరేణ్యంబునఁ గల్గు సప్తజలధి ♦ ప్రావేష్టితాఖండ భూ
మి విధానంబున మూఁడుకాలముల నె ♦ మ్మిం గొల్చులోకాళికిం
దవులంజాలెడి పున్నె మట్టిఁదు మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 122

మ॥ అరివీరోన్మద కుంభికుంభదళనో ♦ ద్యద్రౌద్ర పంచాననం
బురుదుష్ప్రాప్య శరీరబంధగిరిప ♦ క్షోన్మచ్ఛేద సంభ్రాంత బం
ధుర వజ్రంబు పురాత్తతీవ్రదురితో ♦ ద్భూతాబ్దసంవాత మో
పరమేశా! భవదీయభక్తి యగుఁగా ♦ నం జంద్రమౌళీశ్వరా! 123

మ॥ సురభూమీసుర మర్త్యసంఘముల నె ♦ చ్చోఁ గాని దౌర్భాగ్య వి
ష్కిరజంతుచ్ఛటలందు నేనొకట సం ♦ సిద్ధించుఁ బూర్వార్జిత
స్థిరపాపంబులఁ జేసి జన్మ మిట నా ♦ చేతస్సు నీపాద ప
ద్మరజోలేశము భక్తిఁ గోరుకొనుఁ గా ♦ తం జంద్రమౌళీశ్వరా! 124

శా॥ ప్రాతర్వేళ మునింగియేట విధివ ♦ ద్వస్త్రంబు మైఁ దాల్చి సం
ప్రీతి న్మాలికలం ధరించి నిను న ♦ ర్థి న్వామహస్తంబునం
జేతోమోదముమీఱఁ గొల్చి పరముం ♦ జెందు న్మహాభక్తుఁడో
శీతాహార్యకుమారికారతిపతీ! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 125

శా॥ భావిస్వార్చనకుం బ్రసూనహరణ ♦ ప్రారంభ సంరంభ మం
దావంతైన సుతీక్ష్ణకంకటహతిన్ ♦ వ్యావిద్ధుఁడౌవాఁడు దా
నేవంబొందఁడు కాలకింకరకృతా ♦ హీనాష్టకష్టాప్తి నే
నా వ్రాల్లభ్యముగోరు భక్తుఁడ సుధ ♦ న్వా చంద్రమౌళీశ్వరా! 126

మ॥ పరిసవాలంకృతి నీదులింగమునకున్ ♦ భక్తిం బ్రకల్పించు మా
నిసిశంభోజయ! శర్వ శంకర భవా ♦ నీనాథ! మాంపాహి యం
చు సతంబాడెడువాఁడు గాంచఁడెపుడున్ ♦ క్షోభాఢ్యమాతృకు
క్షిసమారోహణ మంద్రు పెద్దలు విపా♦శీ! చంద్రమౌళీశ్వరా! 127

మ॥ అమితాంహఃకరణంబు విప్రవధయం ♦ చావంత చింతింప వు
త్తమనారీజనహాని దోస మని తెం ♦ దంబందు లెక్కింప వే
మి మతంబో? కులధర్మభంగముల నె ♦ మ్మింజూడ వెళ్లైన స
న్నమదిష్టేష్టవరప్రదానవిధి య ♦ న్నం జంద్రమౌళీశ్వరా! 128

శా॥ చేయంగాఁ దగు కృత్యమెద్దియును నే ♦ జేయంగలే దెప్పుడున్
జేయంగూడని చెద్దు మంతయును జే ♦ చేతన్సమర్థించితిన్
హేయం బీదోసఁగుం బొకార్పఁదగు దీ♦వే యెంచి యెట్లేని యున్
శ్రీయు న్భక్తియుముక్తియు న్మెలుపు మో♦శ్రీ చంద్రమౌళీశ్వరా! 129

శా॥ పీఠిం దావకపాదపీఠికపయి ♦ న్వే భక్తి నర్పించి యె
ప్పాటన్ భక్తుఁడ నైన నాయెడఁద నీ ♦ పాగమ్యసిద్ధాంత సం
ఘాటం బొప్పునటుల్ సతంబు ధృతి మిం♦చం జేయఁ గొల్తున్ననీ
జూటా! గోపతిఘోట! వందనములం ♦ దుంజంద్రమౌళీశ్వరా! 130

మ॥ శతకంబుల్ రచియించినాఁడ మును నే ♦ సద్భక్తి రాజేశ్వరాం
కిత మొక్కండు త్రిరాత్రమాత్రమున నో♦కృష్ణార్చితా! యిప్పుడం
చితమార్గంబున నీపయి న్శతకముం ♦ జేయించి తీవౌర! నా
సుతు శ్రీకంఠునిఁ బ్రోవుమీ భృతసుధాం♦శూ! చంద్రమౌళీశ్వరా!

మ॥ అలశ్రీశుండు మఱందియై లలిత భా ♦ ర్యారత్నమై వెండి మే
ల్మల యావాసమునై, ధనేశుఁడు మహా ♦ మాన్యుండు సన్మిత్రుఁడై
బలుహారాంబట్టులగట్టు దివ్యధనువై ♦ భాసిల్లు నిన్గొల్వ బ
ల్కలుము ల్గల్గవె పాపజాలములు వ్రే♦లన్ జంద్రమౌళీశ్వరా! 132

శా॥ దేవేశు న్నిను నిష్ప్రమాదమున నా ♦ దేవాళితో నెవ్వఁడే
భావించు న్సము గాఁగ మానసమునన్ ♦ వాదించు నవ్వాఁడు దా
నీవిశ్వంబున దుఃఖపుంజముల నె ♦ న్నేఁ గాంచి యంతంబునన్
తావుంగైకొను రౌరవాది శితికం♦ఠా! చంద్రమౌళీశ్వరా! 133

మ॥ వసియింప న్గృహమొండు, నందు భుజియిం ♦ప న్నాలుసస్యంబు సా
ధ్వసముంద్రోవ న్కృపావలంబనము దీ ♦ వ్యత్కావ్యనిర్మాణపుం
బస, వైదగ్ధ్యముఁ దావకీనచరణా ♦ బ్జధ్యానసన్నిష్ఠ నీ
యసకృద్వీక్షణ సంపదం గలుగు దే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 134

మ॥ భృగుపత్నిం దెగటార్చి చక్రమున నా ♦ విష్ణుండట న్మౌని పె
ల్లుగఁ గోపించి శపింప దాన నతఁ డి ♦ ల్లుంబాసి నానావతా
రగతుండై యిలజన్మమెత్తి నిను దో ♦ రంబైనభక్తి న్మహో
రగభూషున్ భజియించె నంద్రు మును లౌ♦రా! చంద్రమౌళీశ్వరా!

శా॥ తామత్స్యంబయి ముచ్చుసోమకపదున్ ♦ ధ్వంసించి వేదశ్రుతి
స్తోమం బావిధికిచ్చి యచ్చట గిరీ ♦ శున్ నిన్ బ్రతిష్ఠించి ని
త్యామోదంబున మించె శ్రీశుఁడని వి ♦ ద్యారాశి వ్యాసుం డనెన్
శ్రీమంతు న్నిను బోలు దేవత లిఁకే ♦ రీ? చంద్రమౌళీశ్వరా! 136

శా॥ తామేతై కమలామనోహరు డమ ♦ ర్త్యశ్రేణి దైత్యాళు లు
ద్దామప్రక్రియ సంభ్రమున్ దరుచునం ♦ తన్మగ్నమందాద్రి నెం
తో మోదంబున నెత్తి ప్రాగుదధియం ♦ దున్ నిన్నుఁగూర్మేశునిన్
శ్రీమీఁలింగఁ బ్రతిష్ఠ సేసి కొలిచెన్ ♦ శ్రీచంద్రమౌళీశ్వరా! 137

శా॥ ఆవిష్ణుండు వరాహమై వడి హిరణ్యా ♦ క్షున్ హతున్ జేసి బల్
ఠీవిన్ లోకమునేలి శ్రీగిరిపయిన్ ♦ లింగప్రతిష్ఠన్ లస
ద్భావస్ఫీతిఁ బొనర్చి యొప్పెనన నీ ♦ భాగ్యంబు దేవాళియుం
దేవారేఁ గనలేరు నిక్కముకపా ♦ లీ! చంద్రమౌళీశ్వరా! 138

మ॥ ఘనుఁ బ్రహ్లాదుని బ్రోవఁ గంబమున వీ ♦ కన్ నారసింహాకృతిన్
జననంబంది హిరణ్యపూర్వకశిపున్ ♦ సంహారమున్ జేసి శే
షనగాగ్రంబున స్వీయనామమున నిన్ ♦ స్థాపించి పూజించె నం
చనిపల్కెన్ గద బాదరాయణి మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 139

శా॥ శ్రీలక్ష్మీశుఁడు బిచ్చమెత్తుకొనఁగా ♦ శ్రీవామనుండై బలిన్
లీలన్ గోరి పదత్రయంబుఁ గొని వా ♦ నిం గ్రిందికిం ద్రోచి దే
వాళిన్ బ్రోచి సురేంద్రుగాచి శివుని ♦ న్నాదృత్యన్ స్వనామాంచితున్
బోల నిల్పె హిమాచలాగ్రమున శం ♦ భూ! చంద్రమౌళీశ్వరా! 140

మ॥ కమలానాథుఁడు రాముఁడై విబుధలో ♦ కం బెన్న జన్మించి దు
ష్టు మదాంధుం దశవక్త్రుఁ బేరడఁచి శి ♦ ష్టుం గుంభజుం గొల్చి శై
వమతంబున్ గొని రామలింగవిభు నిన్ ♦ భక్తిం బ్రతిష్ఠించి చెం
దె మహాతేజము వందనంబులు కప ♦ ర్దీ! చంద్రమౌళీశ్వరా! 141

మ॥ యదువంశంబున రౌహిణేయుఁడన వి ♦ ష్ణ్వంశంబునం బుట్టి దు
ర్మద రాత్రించరసంఘమున్ దునిమి ధీ ♦ రశ్రేణిఁ బోషించి కా
శిఁ దగన్ లింగము శాస్త్రపద్ధతిఁ బ్రతి ♦ ష్ఠించెన్ మహోత్సాహసం
పద భక్తాళికిఁ గూర్చు తేఁడ! శివనా ♦ మా! చంద్రమౌళీశ్వరా! 142

మ॥ వసుదేవాత్మజుఁడై జనించి హరి వి ♦ శ్వస్తుత్యు దూర్వాసు సా
ధ్వసభక్తు ల్దగఁ గొల్చి శైవుడయి వే ♦ దధ్యేయమామూర్తి నిం
పెసలారఁగ నిను గాశికా పురిని ని ♦ ల్పెం జక్రిముం గాంచె శ
త్రుసమూహంబును నొంచె మించె వృష కే♦తూ! చంద్రమౌళీశ్వరా!

శా॥ భూతశ్రేణి సరస్వతీవిభుఁడవై ♦ పుట్టింతు లక్ష్మీపతి
ఖ్యాతిం బ్రోతువు పార్వతీసహచరా ♦ ఖ్యన్ హానివాటింతు వే
ప్రీతిన్ స్థితిని భీతిఁ జెందవు, మహా ♦ శ్లిష్టవ్యనైర్గుణ్య సం
జాతానందసురూపశాలివి మహే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 144

శా॥ నీలింగం బెదఁదాల్ప నీకథవినన్ ♦ నీపాదనిర్మాల్య ని
ష్ఠాలాలిత్య మెఱుంగ నీదుభజనా ♦ స్థం గాలముంబుచ్చ నీ
లీల ల్గాంచఁగ నీసమర్చితము నో ♦ లిం జెంద రక్షింపవే
శీలం బీనెటి జన్మజన్మములకున్ ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా ! 145

మ॥ శ్రుతి రుద్రుం డొకఁ డన్న నొల్లక వరి ♦ ష్ఠు న్నిన్నుఁ బూజింప దు
ర్మతిఁ బౌరాణికగాథలన్విని సుతా ♦ రం బెన్న కే యన్య దే
వతలం గొల్తురు ధూర్తు లిక్కలిఁ దరిం ♦ పంబోరు సత్యంబు నీ
వ్రతులంగూర్చి భరింపవే శరణులు ♦ గ్రా! చంద్రమౌళీశ్వరా! 146

మ॥ శతమన్యుప్రముఖాఖిలామరసుమ ♦ స్తన్యస్తసద్భూషణాం
చితమాణిక్యకిరీటదీధితిలస ♦ చ్ఛ్రీపుంజనీరాజితాం
ఘ్రితలుం డెవ్వఁడు నిన్నుబోల విబుధ ♦ శ్రేణి న్విలోకింప నీ
జత నీవే యని నమ్మికొల్చెద గిరీ ♦ శా! చంద్రమౌళీశ్వరా ! 147

మ॥ నినువర్ణించెడువాఁడు సత్కవి సదా ♦ నీనామసంకీర్తనం
బును గావించెడువాఁడు యోగి స్వీకయా♦మూర్తి స్వపాదాంభోజమం
దున పూజించెడువాఁడు భక్తుఁడు కృతా ♦ ర్థుం డెల్లచో నీదుప్రా
పున మేల్గాంచెడువాఁడు పల్కితి నిజం♦బున్ జంద్రమౌళీశ్వరా! 148

శా॥ ఏనఃపుంజపరంపరావలయితా ♦ హానాష్టకష్టాలి దు
ష్టానిష్టగ్రహతారకాప్రణిహితా ♦ త్యర్థాధిరింఛోళ్లి జు
ష్టానేకామయపాళి నీభజన మ ♦ త్యాసక్తిఁ గావించు న
వ్వానిం జెందక దూరమేగెడిని దే ♦ వా చంద్రమౌళీశ్వరా! 149

మ॥ సుతు లవ్వీరకుమారభైరవ గణే ♦ శు ల్పార్వతీదేవి నీ
సతి తత్సోదరుఁ డిందిరావరుఁడు నీ ♦ సన్మిత్రుఁడున్ శ్రీదుఁ డా
శ్రితులున్ బ్రహ్మముఖామరుల్ పరిభవ ♦ శ్రీ నిట్లుమిన్నుట్టు నీ
స్తుతి యస్మాదృశసాధ్యమే వృషభకే ♦ తూ? చంద్రమౌళీశ్వరా! 150

మ॥ సమహోత్సాహము మీఱ నీశతకము ♦ న్శార్దూలమత్తేభ వృ
త్తములం గూర్చితి వీరభద్రుఁడను నీ ♦ దాసుండ నాపల్కులం
దు మహాదోషములుండునే? సకలపూ ♦ ర్ణ న్భక్తిఁ గొండాడుచో
ట మహేశా! క్షమియింపనౌనుఁగ అకం ♦ తా! చంద్రమౌళీశ్వరా! 151

మ॥ తరమా? మాదృశులైన వారలకు నీ ♦ దాక్షిణ్యసంపత్తి ను
ర్వర వర్ణింపఁగ సంస్తుతింపఁగ బుధేం ♦ ద్రశ్రేణి వెన్కాడ వే
గిర మీభక్తుని వీరభద్రకవి నీ ♦ క్రేగంట నీక్షింపు మో
వరదా! జగ్గయపేటవాస! గురుదే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 152

మ॥ శతకం బిద్ది పఠించువారలకు స ♦ త్సంతానము ల్గల్గు దీ
ర్ఘతరాయుష్యము గల్గు బుద్ధియును బా ♦ రంబందు శ్రీమత్తయున్
సతముంజెందు బరమ్మునం గలుగు మో ♦ క్షశ్రీసమాలింగనో
న్నతిసౌఖ్యంబు నిరంతరంబుగ నసం ♦ తా చంద్రమౌళీశ్వరా! 153

శా॥ ఆకాశాగ్నినిధీంద్రసంఖ్యలను హూ ♦ ణాబ్దంబు పెంపొందఁగా
నీకై కూర్చితి భక్తి నీశతకము ♦ న్నే శ్రావణి న్దేవదే
వా! కైకొమ్ము భవత్సమర్పకుఁడ న ♦ త్యంతంబు మోదింతు నీ
శ్రీకైవల్య మొసంగ వేఁడెదను నే ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 154

శ్రీ చంద్రమౌళీశ్వరార్పణమస్తు.

శ్రీచంద్రమౌళీశ్వరశతకము సంపూర్ణము.